

"కానిస్టేబులుకూతురు" నటి రాజశ్రీ.


STUDIO Ketna


( సందేహమెందుకు
బిన్నీవారి
జార్జెట్ అచ్చమైన శిల్కు చీర
విశిష్టమైన డిజైనులో రక
రకాల జార్జెట్, ఎఫాన్
ఇంకా మృదువైన శిల్కులు
లభిస్తాయి

# ఉత్తరాలు

## ముఖచిత్రం

27—9—63 సంచిక ముఖచిత్రం కుమారి కృష్ణకుమారి చాలా బాగుగానున్నది. ఇటువంటి చిత్రములే వేయమని మనవి.

ఎం. రాజారావు (గూడూరు)

* * *

సెప్టెంబరు నెలలో 20వ తేదీ సంచికపై ముఖ చిత్రముగా వెలువడిన వర్ధమాన నటి (కుమారి) జయంతి చిత్రము చాలా బాగుగ నున్నది.

బి. సి. సరోజాశేఖర్, (తాడేపల్లిగూడెం)

## కథలు

'వ్యక్తిత్వం' కథ మాకూ బాగా నచ్చింది రచయిత, కొంతకాలము క్రిందట సహాధ్యాయి గనుక మరీ సంతోషము.

ఎ. యల్. మోహన్ మరియు
ఇతర ప్రవాసాంధ్రులు, పర్భణి (మహారాష్ట్ర)

* * *

20—9—63 తేది ఆంధ్ర సచిత్ర వార పత్రికలో శ్రీరామచంద్రమూర్తిగారి "వ్యక్తిత్వం" కథలో శ్యామసుందరంను మెచ్చుకొనక తప్పదు. కాబోయే వరులు కూడ ఆ విధంగానే అనుసరిస్తే బాగుంటుందని మా అభిలాష -

తుమ్మల రఘునాథ్, తుమ్మల శ్రీపతి, తుమ్మల నారాయణ (అప్పికట్ల)

## కార్టూన్

మన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రతి వారం ప్రచురించ బడుచున్న — ప్రఖ్యాత చిత్రకారుడైన 'ఊమెన్'గారి వ్యంగ్య చిత్రాలను చూస్తుంటే నాకు నవ్వు పుట్టుకొస్తుంది నాకేకాదు ప్రతి వారికీ నవ్వు పుట్టుకొస్తుంది. మన రాజకీయ నాయకుల 'అవకతవక' పరిపాలన మధ్య సామాన్య ప్రజానీకం ఎలా అవస్థల పాలవుతుందో బాలబాలికలకు సైతం సులభంగా ఇట్టే తెలుసుకోగలిగేట్టుగా చిత్రీకరించే 'ఊమెన్' గారి సామర్థ్యాన్ని ఎంతైనా కొనియాడ వలసిందే! శ్రీ 'ఊమెన్' గారికి నా ధన్యవాదములు.

తలిసెట్టి ఆనంద్ (తిరుపతి)

## మనవి

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో అనేక విధములయిన శీర్షికలను ప్రవేశపెడుతున్నారు కదా! అలాగే హిందీకూడా నేర్చుకొనుటకు ఒక క్రొత్త శీర్షిక ప్రవేశపెట్టమని మనవి చేస్తున్నాను.

లక్ష్మిప్రభ (టాటానగర్)

★ **ఈ పత్రికవిధానం ప్రభుత్వం అమలు పరచాలని చూసే హిందీ విధానానికి పూర్తిగా వ్యతిరేకం!**

వనితలకు ప్రత్యేకం!

**25-10-63**

## దసరా సంచిక!

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు

*

శుక్రవారం : 11—10—63
శోభకృన్నామ సం॥ ఆశ్వయుజ బహుళ నవమి
సంపుటము 56 సంచిక : 6

స్థాపితము :
1908

*

ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్

*

సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా . రూ. 13.00 ఇతర దేశాలు : ఓడమీద (Sea Mail) రు. 20.00. (విమానం ద్వార (Air Mail) బ్రిటన్. జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాల- రూ. 114.00. అమెరికా రూ. 176.50 ఆస్ట్రేలియా 135.00.)

*

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

*

ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1





వర్ధమాన నటి స్వర్ణ (ప్రభాకర్)

# మనలోమాట

ఈ వారంనుంచీ ప్రారంభించిన కొత్త శీర్షిక 'ఆసియా కథలు'ను గురించి 21 వ పేజీలోనే వ్రాశాము. వచ్చేవారం ఇండొనేసియా కథ ప్రచురిస్తున్నాము.

* * *

శ్రీమతి సుచేతా కృపలానీ మన దేశంలో ముఖ్యమంత్రి పదవి ఆక్రమించిన తొలి మహిళ. వనితాలోకం పఠితలకు ఆమె జీవిత చరిత్ర తెలుసుకోవాలని అనిపించవచ్చు! వారు ఈ సంచిక 11వ పేజీ చూస్తే శ్రీమతి కృపలానీ గురించిన వ్యాసం కనిపిస్తుంది...

* * *

పైవారం శ్రీ తులసీదాసు 'రామ చరిత మానస్' తెలుగు అనువాదం ప్రారంభిస్తున్నాము.

ఆ పైవారం సంచిక - దసరా సంచిక - వనితలకు ప్రత్యేక సంచికగా వెలువడుతుంది. వివరాలు వచ్చే సంచికలో యిస్తాము...

★

# లోకంపోకడ



"నీ అంతవాణ్ణే నేనుకూడా! కాదని ఎవరంటారూ?"

---

## మహిళల పొదుపు రక్షణ నిధికి పుదుపు
## పురుషుల శక్తి దేశానికి రక్షణ నిధి

---

# విషయానుక్రమణిక


పెట్రోలైపోయిందా?
కామరాజ్ పథకం


కాంగ్రెస్ అధ్యక్ష పదవి


కొట్టుకోనేందుకు కర్రలా?


నా మందు సర్వ రోగనివారిణి
కాంగ్రెస్


కాని మందు ఓ మోతాదు త్రాగాక కడుపునొప్పి ఎక్కువైంది

శ్రీకృష్ణ

# 'వీరపూజ' చేసే కాంగ్రెస్: అనుసరణగా మారిన ప్రజాస్వామ్యం!

"ఆంగ్లజాతి అలవాటు, క్రమ పరిణామాల ద్వారా మాత్రమే అనేకమైన సంస్థలను ఆకర్షించుకో గలిగింది. మిగిలిన జాతులన్నీ ఓర్పు, సంప్రదాయాలు అనుకరించే తాపత్రయంతో ఆ పంస్కారంలోకి దుమికాయే కాని వేరే ఏం లేదు. అందుకనే ఆజాతులు ప్రజాస్వామ్యాన్ని క్రమపద్ధతిలో అలవరచుకోటానికి బదులుగా అమాంతం అనుసరిస్తున్నాయి." ఈ మాటలు అమెరికా అధ్యక్షుడు విల్సన్ అన్నవి.

మొన్న మొన్న జరిగిన మన పార్లమెంటు సమావేశాల తీరు చూస్తే విల్సన్ చెప్పినట్లుగానే, భారతదేశం కూడా ప్రజాస్వామ్యాన్ని సృష్టించుకోటానికి బదులు వూరికే అనుసరిస్తోందా అనిపిస్తుంది. ఒకానొక్క సుప్రభాతాన లోక్‌సభలోని కార్యక్రమమంతా హఠాత్తుగా ఆగిపోయింది. అదేమయ్యా అంటే, పాకిస్తాన్ సరిహద్దులో అస్సాం ప్రాంతంలో జరిగిన కాల్పుల సంఘటనపై ప్రధానమంత్రి చేసిన ప్రసంగాలకు హిందీ అనువాదం కావాలనీ శ్రీ బగ్రీ కోరార్ట. బహుశా ఆయనకు దేశ భద్రతకన్న, హిందీయే ఎక్కువేమో!

సరే, ఇదిలా ఉంచుదాం. పంజాబ్ ముఖ్యమంత్రి సర్దార్ ప్రతాప్‌సింగ్ కైరాన్ గురించి చాలా విషమమైన వాతావరణం ఏర్పడిపోయి రాజ్యసభలో చర్చ జరుగుతున్న సమయంలో ఒక కాంగ్రెస్ సభ్యుడు కైరాన్ వ్యవహారంలో మీకేమిటి సంబంధమని ప్రశ్నిస్తే మన ప్రధాన మంత్రి ప్రస్తుతం జరుగుతున్న ఈ రభస విషయంలో శ్రీ కైరాన్‌తో తమ కేలాటి సంబంధమూ లేదని నిష్కర్షగా చెప్పారు. బాగానే ఉంది. మరి వివిధ రాష్ట్రాల ముఖ్యమంత్రుల విషయంలో కూడా ఆయనకూ కామరాజ్ పథకానికి ఏలాంటి సంబంధమూ ఉండకూడదు కదా! రాజ్యాంగరీత్యా చూస్తే కేంద్ర మంత్రివర్గ పునర్నిర్మాణంతో సహా కామరాజ్ ప్రతిపాదనను అమలు జరపవలసిందిగా ప్రధాని కాంగ్రెస్ అధ్యక్షుణ్ణి కోరాలి. అంతేకాదు, పంజాబ్ ముఖ్యమంత్రి పరిపాలనా సామర్థ్యాన్ని గురించి వూరికే ప్రశంసా ప్రకటనలు పారేస్తూ కూచో కూడదు. కాని, మన ప్రధాని అసలుద్దేశ్యమేమంటే ఈ రాష్ట్రాల, కేంద్రం, మంత్రులు ముఖ్యమంత్రులూ రాజీనామాలు సమర్పించే ఉన్నత స్థానంగా తామే ఉండాలని. ఈ హోదాతోనే ఆయన ఉత్తరప్రదేశ్, ఒరిస్సా, బీహార్, మధ్యప్రదేష్, మద్రాస్, జమ్ము, కాశ్మీర్ ముఖ్యమంత్రుల రాజీనామాలను ఆమోదించవలసిందిగా కేంద్ర కాంగ్రెస్ కార్యవర్గానికి సిఫార్సు చేయాలని నిశ్చయించుకున్నారు. అయితే మొరార్జీతో కొద్దిగా యిబ్బంది వచ్చింది. కారణ మేమంటే గుజరాత్ ముఖ్యమంత్రి పదవీచ్యుతి, రాజ్యాంగరీత్యా సరిగానే ఉన్నా, కామరాజ్ పథకానికి వ్యతిరేకంగా జరిగింది.

సరే, ఇది ఇలా ఉండగా ఉత్తరప్రదేశ్ కాంగ్రెసు శాసనసభా కార్యవర్గానికి నాయకురాలుగా ఎన్నికైన వెంటనే శ్రీమతి సుచేతా కృపలానీ, తమకు భారత ప్రధాని మద్దతు ఉందని బాహాటంగా ప్రకటించారు కదా! మరి ఇది రాజ్యాంగబద్ధమేనా!

మొన్న జరిగిన పార్లమెంటు సమావేశాన్ని ఒక

ఇంక రాజకీయ రంగాన్ని కూర్చి చూద్దాం. కాంగ్రెస్ పార్టీ విషయం తీసుకుంటే ప్రధానమంత్రి పునరుజ్జీవాన్ని సాధించినట్లే అనుకోవాలి. తన మంత్రివర్గంలోని 'ఇబ్బంది' అనిపించే సిబ్బందిని బయటికి పంపించాగు. ఇంక మంత్రివర్గంలో మిగి




వన్యమృగరక్షణ వారోత్సవం సందర్భంలో భారత తంతి - తపాలాశాఖవారు ఈ రకం ప్రత్యేక తపాలా బిళ్ళలను అక్టోబరు 7 న విడుదలచేశారు.

భారత చరిత్రలో ఒక పెద్ద మైలురాయి అనిపిస్తుంది. ప్రణాళికా సంఘం చేసిన తీర్మానం, దాన్ని మాజీ ఆర్థికమంత్రి శ్రీ మొరార్జీదేశాయ్ అమలు జరిపిన విధం ఈ దేశాన్ని ఒక మురికికూపంలా తయారుచేశాయి. సమావేశం ముగింపుకు ఎప్పటికి, కాస్తగా అమర్పు కలిగి అభివృద్ధికి అనుకూల వాతావరణం ఏర్పడింది. ప్రణాళికా సంఘంలో కూడా కొన్ని మంచి మార్పులు జరుగుతున్నాయి.

లినవాళ్ళు నోరులేనివాళ్లు గనక పార్టీ మద్దతుకోసం వాళ్ళెటూ ప్రధానమంత్రి మీదనే ఆధారపడాలి.

ఇదివరకు— కామరాజ్ పథకానికి ముందు— పార్టీని విమర్శించేవాళ్లకన్నా, ఇప్పుడు కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీని విమర్శించేవాళ్ల సంఖ్య ఎక్కువ. అయితే ఈ విమర్శకులు ఎవరుట! ఎవరో కాదు,

49 వ పేజీ చూడండి

హెచ్చు గ్రాహ్యశక్తి కలది...స్టేషనులను కచ్చితముగా పెట్టుటకు అనువైనది...
మాన్‌సూనైజ్ చేయబడినది...

# నేషనల్ ఎక్కో కంపెనీవారు

## అందచేసే క్రొత్త మోడలు ఎ-789

### శబ్దమును తద్రూపముగా వినిపించుటకు
### 2 స్పీకర్లు అమర్చబడినవి



ఇదిగో నేషనల్-ఎక్కో-వారు తయారుచేసే క్రొత్త రేడియోలలో మొదటిది — మోడలు ఎ-789! దీనికి రెండు స్పీకర్లు మరియు 'మేగ్నీ-బ్యాండ్' ట్యూనింగు కలవు. ఇది పూర్తిగా మాన్‌సూనైజ్ చేయబడినది. ఈ పెట్టె నేషనల్-ఎక్కో-వారి ఘనమైన రేడియోలలో ఒక క్రొత్త తారగా వెలుగుతుంది!

ఈ సొగసైన రేడియోను మీ దగ్గరలోనున్న నేషనల్-ఎక్కో-రేడియో డీలరువద్ద నేడే చూడండి. దీని అందమైన ఆకారమును, శ్రావ్యమైన ధ్వనిని మీరు మెచ్చుకుంటారు!

**మోడలు ఎ-789:**
6 వాల్వులు. పూర్తిగా బ్యాండ్ స్ప్రెడ్ చేయబడిన 8 బ్యాండులు. 2 హై-ఫ్లక్స్ ఎలిప్టికల్ స్పీకర్లు. అందమైన క్యాబినెట్.

**రు. 667.00**

ఎక్సైజ్ డ్యూటీతో సహా; పన్నులు అదనము

జెనరల్ రేడియో & అప్లయన్సెస్ లిమిటెడ్ GRA
బొంబాయి . కలకత్తా . మద్రాసు . ఢిల్లీ . బెంగుళూరు . పాట్నా . సికిందరాబాదు

JWT-GRA-1525

నేషనల్-ఎక్కో-రేడియోలు శ్రేష్ఠమైనవి—అవి మాన్‌సూనైజ్ చేయబడినవి

# నగరంలో కామరాజ్ పథకంవల్ల బయటకు వచ్చిన మంత్రులు

ఈ మధ్యన, మన రాజధాని నగరానికి, కేంద్ర మంత్రులు, ఉద్యోగాలు ఊడిపోయిన మంత్రులు, కాంగ్రెసు అధ్యక్షులవారు విచ్చేశారు. పెద్దలు రాంగానే, పత్రికా ప్రతినిధులో, తదితరులో కొన్ని ప్రశ్నలు వేయటం, వారు ముచ్చటగా సమాధానాలు చెప్పటం పరిపాటే, పత్రికా ప్రతినిధులు సమావేశాలు జరపటం కూడా కద్దు. ఈ పని మాజీ మంత్రులకు మహాసరదా, మరి అవసరం కూడానేమో! కాంగ్రెసు అధ్యక్షులు విజయవాడ వెళుతూ, ఇక్కడ కొస్త బసచేశారు. రాష్ట్ర మంత్రివర్గాలు విస్తృతంగా ఉండటానికి అభ్యంతరంలేదు గాని, కుదిమట్టంగా మాత్రం ఉండాలన్నారు. మరి ఆంధ్రప్రదేశ్ మంత్రివర్గం, ఏ నిర్వచనంక్రింద వస్తుందీ అన్న ప్రశ్నకు సమాధానం చెప్పటానికి నిరాకరించారు. దీని భావమేమి! కామరాజ్ పథకాన్ని వేనోళ్ళ కొనియాడారు. ఇది సద్యః ఫలితాలు ఇస్తుందనటంలో సందేహంలేదు. ఇంకా ముందు ముందు కూడా, దీని అమలువలన అనేక లాభాలుంటాయన్నారు. బాగానే ఉంది. మొన్నీమధ్య మేయర్ ఎన్నికల్లో జరిగిన 'రసాభాసకు' కామరాజ్ పథకం యొక్క మూల సిద్ధాంతానికి సమన్వయం ఎట్లా చెపుతారంటే సూటిగా సమాధానంలేదు. అవినీతిని, నిర్మూలం చెయ్యటానికి, కాంగ్రెసు వారు కృతనిశ్చయులై ఉన్నారన్నారు. ఇదివ్వాళ కొత్త విషయమేమీకాదు. వారి నిశ్చయాలు, నిర్ణయాలు కార్య రూపంలోకి వచ్చాయా అనేదే ప్రశ్న. ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ వ్యవహారాల్లో తల దూర్చటానికి ముందంజ వేయలేదు. ఉన్న భేదాభిప్రాయాలు ఉండనే ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి బస ముందు శ్రీ గోరాగారు 'ఆడంబరాలు విడనాడాలి' అనే ఆర్భాటానికి మాత్రం ఆశీస్సులు పల్కారు. నిరాడంబర జీవితంలోనూ, పొదుపు ఉద్యమంలోనూ, మాకందరికీ విశ్వాసాలున్నాయని ప్రకటించారు.

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిగారు, కేంద్ర మంత్రి పదవీ విరమణ చేసి ఇచ్చటకు వచ్చారు. ఇకవారు, రాష్ట్రమంత్రి. తిరిగి, కాంగ్రెసు సూత్రావళిని ప్రచారం చేసుకుంటూ ఉంటారు. కామరాజ్ పథకం క్రింద, దెబ్బతిన్న, కేంద్ర మంత్రులలో వీరొకరు. తన రాజీనామాను కూడా ఆమోదిస్తారని మొదట్లో వూహించక, తికమక పడ్డ ప్రముఖుల్లో ఒకరయిన గోపాలరెడ్డిగారు తర్వాత, తట్టుకుని, తమాయించుకుని ఆ పథకం యొక్క గొప్పతనాన్ని పొగడటానికి కావలసిన ధైర్యాన్ని పుంజుకున్నారు. ఆనాడు మహాత్మా గాంధీజీ నాయకత్వాన, బహిష్కరణోద్యమం జరిపినట్లే, ఈనాడు, పదవులు త్యజించి ప్రజల్లో పడి వారికి, ప్రభుత్వానికి మధ్య, సామరస్యం సెంపొందేటట్లు కృషి చెయ్యటానికి కల్పించబడిన అవకాశమే ఈ పథకం యొక్క అంతరార్థమన్నారు. పత్రికా ప్రతినిధుల సమావేశంలో ప్రసంగించారు. తాను 'కూటముల'కు అతీతుడని, బేగంపేట విమానాశ్రయం వద్ద ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసులో వర్గాలు రెండూ ప్రాతినిధ్యం వహించడమే దీనికి తార్కాణమన్నారు. అంటే వారిని ఆహ్వానించటానికి ఉభయ వర్గాల వారు హాజరయ్యారన్న మాట! తర్వాత కాసేపు తన జీవిత చరిత్ర విశేషాల స్ఫురణకు తెచ్చుకున్నారు. ఉద్యోగభారం వదిలిపోయినందుకు చాలా హుషారుగా ఉన్నట్లు కనిపించారు. ఎప్పుడూ కూడా సంతోషంగానూ ఉల్లాసంగానూ కనబడుతూ ఉండటం వారికి అలవాటే! సాధారణంగా రాజకీయరంగంలో ప్రవేశించంగానే, సాహితీపిపాస, సాహిత్యకృషి నశించటం మాట అటుంచి, మొద్దు బారిపోయి, యంత్రం లాగ పనులు చేసుకుంటూపోతూ సామాన్య ప్రజకు అతిభయంకరంగా కనిపించటం, రాజకీయవాదులో కనిపిస్తున్నదే! అయితే గోపాలరెడ్డిగారు అట్లాకాదు. ఎప్పుడూ నాజూకు మనిషే! రాష్ట్ర మంత్రి పదవిలో ఉన్నా, కేంద్రమంత్రిపదవి నిర్వహిస్తున్నా, ఆయనదంతా కళాదృష్టే! ఇప్పుడున్న తీరుబాటును పురస్కరించుకుని, సాహిత్యరంగంలో ఇతోధికంగా కృషిచేస్తూ, ఔత్సాహికులకు, నూతనోత్తేజాన్ని కలిగించగలరని . ఆశించటం సముచితంగానే ఉంటుంది.

ఇక డాక్టర్. కె. యల్. రావుగారు (నీటి పారుదల, విద్యుచ్ఛక్తి కేంద్రమంత్రి) వచ్చారు. ఆంధ్రప్రదేశ్ అవసరాలను గురించి, రాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులతో చర్చలు సాగించారు. ఎంతవరకు ఈ అవసరాలను తీర్చగలరో చూడాలసి ఉంది. నదుల నీటి పంపిణీ విషయంలో రాష్ట్రాల మధ్య తగాదాలు అట్లాగే ఉన్నాయి. ఉద్రిక్తత ప్రస్తుతం సమసి పోయిందే గాని, అసలు సమస్య అట్లాగే ఉండిపోయింది. 1951 ఒప్పందాన్ని మార్చటానికి ఆంధ్రులు సుతరాం వ్యతిరేకంగా ఉన్నారు. ఆ ఒప్పందం అన్ని రాష్ట్రాల అవసరాలను దృష్టిలో ఉంచుకుని చేయటం జరిగింది. ఎవరికీ అన్యాయం జరగనూలేదు. మోసం అంతకంటేలేదు. నాగార్జునసాగర్ లాంటి పెద్ద ప్రాజెక్టును నిర్మించటానికి పూనుకొనటంతో ఇతర రాష్ట్రాలకు కన్నెర్రయినట్టుంది. ఎన్నో తుఫానులు లేవదీశారు. కీర్తిశేషులు అల్లూరి సత్యనారాయణగారు దీని విషయంలో ఎక్కువ శ్రద్ధకూడా కనపరిచారు. ఇంతకీ చెప్పొచ్చిందేమిటంటే. యీ నదీ తగాదాల విషయం డాక్టర్ కె. యల్. రావుగారిని అడుగుతే, సమాధానం చెప్పకపోగా పైగా దీని సంబంధించిన ప్రశ్నలు వెయ్యద్దనికూడా కోరారు. మన ఆంధ్రుడు మంత్రి అయినందువలన ఒరిగి ఒళ్లో పడేదేమీలేదు. న్యాయం చెయ్యటానికి వెనకా ముందు ఆడటం, మన ఆంధ్రుల కోరికలు ఎంత సమర్థవంతమైనవైనా, ఒకవేపు వాటిని అవునంటే, ఆంధ్రుడు కాబట్టి ఇట్లా పక్షపాతం వహించాడని యెవరైనా అనబోతారేమోనని భీతివలన మవునం వహించటం మన ఆంధ్ర ప్రముఖులకు మొదటి నుంచి అలవాటే! దీని వలన న్యాయం ఎక్కువగా జరగటం కూడా, చిన్న స్థాయిలోనూ, పెద్ద స్థాయిలోనూ కూడా అనుభవం వలన తెలుస్తూనే ఉంది. ఈ జాడ్యానికి లోనుగాకండా, డాక్టర్ కె. యల్. రావుగారు

49 వ పేజీ చూడండి

## వనితాలోకం

# మహిళలలో మొదటి ముఖ్యమంత్రి!

శ్రీమతి సుచేతా కృపలానీ చరిత్ర సృష్టించింది. భారతదేశంలో ఒక రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఎన్నికైన తొలిమహిళ ఆమె. ఆమె ప్రఖ్యాతికి వచ్చింది దొడ్డిదారిన కాదు. బ్రహ్మాండమైన ప్రాతికూల్యములను అధిగమించి ఆమె యీ స్థానానికివచ్చిందంటే న్యాయబుద్ధిగల విమర్శకు డెవరూ కాదనరు.

సుచేత, అభ్యుదయ భావాలుగల ఒక బ్రహ్మసమాజకుటుంబంలో జన్మించింది. 1908 లో అంబాలాలో యీమె జననం. ఆమె తాత అమిత ఉత్సాహము కార్యదీక్షగల సంఘసంస్కర్తగా పేరుపొందారు. సనాతన సంప్రదాయాలు కరడుగట్టిన బెంగాల్‌లోని చాక్దావద్దగల తన తాతలనాటి గృహాన్ని విడిచిపెట్టి, ఆయన పంజాబ్ రావటానికి ఇదే కారణము. పంజాబ్ వాతావరణము సరళమైనది. ఆమె తండ్రి వైద్యశాఖలో పనిచేసేవారు. సంఘసంస్కరణకు సంబంధించినంతవరకు ఆయన పాతకాలపు మనిషి.

తొమ్మిదిమంది సంతానంగల కుటుంబంలో సుచేతయే పెద్దది. ఆమె విద్యాభ్యాసం పంజాబులోను ఢిల్లీ విశ్వవిద్యాలయంలోను సాగింది. ఆమె కళాశాల జీవితం ప్రతిభావంతమైనది. చరిత్ర రాజకీయ శాస్త్రాల్లో ఎం. ఎ. డిగ్రీ గ్రహించింది. ఉత్తీర్ణులైన అభ్యర్థులలో ప్రథమురాలుగా వచ్చినందుకు ఆమెకు ఒక స్వర్ణపతకం గూడా లభించింది. ఆటు తరువాత ఆమె కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో చరిత్రోపన్యాసకురాలుగా ప్రవేశించింది.

ఆమె కడగొట్టు తమ్ముడు సంవత్సరన్నర ప్రాయంలో ఉండగా తండ్రి మరణించారు. తన సోదరీ సోదరుల పోషణభారం ఆమె వహించవలసి వచ్చింది. సుచేత యీ పనిని అత్యంత భక్తి శ్రద్ధలతో నిర్వహించింది. తన వివాహాన్ని గురించి ఆలోచించకుండానే చెల్లెళ్లకు పెళ్లిళ్లు చేసింది. తరువాత 1936 లో ఆమె ఆచార్య కృపలానీని వివాహమాడింది.

శ్రీ జె. బి. కృపలానీ అప్పట్లో కాంగ్రెస్ కార్యదర్శిగా ఉంటూ ఉండేవారు. ఆమ్మట 1946—47 లో ఆయన కాంగ్రెస్ అధ్యక్షులైనారు. ఉభయులూ పట్టుదలగల కాంగ్రెస్ కార్యకర్తలే. నెహ్రూ కుటుంబంతో వారికి దృఢ బంధాలు ఏర్పడ్డాయి. జవహర్‌లాల్ నెహ్రూ తల్లి పట్టుపట్టటం మూలంగా వారి వివాహం ఆనంద భవన్‌లో జరిగింది. శ్రీ నెహ్రూ, జైలునుంచి విడుదలైన రోజునే యీ వివాహం ఏర్పాటైంది.

శ్రీమతి కృపలానీ మొదటి నుంచీ సాంఘిక సేవ చేస్తూనే ఉంది. 1934 లో బీహార్ భూకంప బాధితులకు సహాయ కార్యక్రమాలను వ్యవస్థీకరిస్తూ వేలలకొద్దీ గ్రామాల్లోనే గడిపింది. ముఖ్యంగా ఆమె జరిపిన కృషివల్లనే కాంగ్రెస్ సంస్థ మహిళా విభాగం ఏర్పాటైంది.

స్వాతంత్ర్య పోరాటంలో ఆమె ఎప్పుడూ అగ్రగామిగానే ఉంటూవచ్చింది. 1940 లో అరెస్టయినప్పుడు 14 మాసాలపాటు ఆమె జెయిలు శిక్ష అనుభవించింది. తరువాత 1942 ఆగస్టు ఉద్యమంలో నాయకులందరూ అరెస్టయినప్పుడు రెండు సంవత్సరాలపాటు ఆమె పోలీసులను తప్పించుకుంటూ పనిచేసింది. అయినా చివరకు అరెస్టయింది.

1945 లో జెయిలునుంచి విడుదల అయిన తరువాత ఆమె ఎక్కువగా సాంఘిక సహాయ కార్యకలాపాల్లో పాల్గొంటూ వచ్చింది. స్త్రీలకు పిల్లలకు ఉద్దేశించబడిన కస్తూర్బాస్మారకనిధి వ్యవస్థా కార్యదర్శిగా ఆమె పనిచేసింది. 1946 లో మతకలహాలు ప్రజ్వరిల్లినప్పుడు సుచేత తూర్పు బెంగాల్‌కువెళ్లి, తన ప్రాణాన్ని గూడా లెక్కపెట్టకుండా స్త్రీలను పిల్లలను కాపాడింది.

తిరిగి 1947 లో పంజాబులో అల్లర్లు చెలరేగినప్పుడు ఆమె అక్కడికివెళ్లి సహాయ కార్యక్రమాలు వ్యవస్థీకరించింది. భారత విభజన అనంతరం లక్షల కొలది హిందూ శరణార్థులు, ఢిల్లీ, తూర్పు



శ్రీమతి సుచేతా కృపలానీ

పంజాబ్ ఉత్తరప్రదేశ్ తదితర ప్రాంతాలకు ఒకే ధారాళంగా వచ్చిపడుతున్న సమయంలో కాంగ్రెస్ సహాయవిభాగం కార్యదర్శిగా ఆమె 1947 నుంచి 1952 వరకు భారీఎత్తున అనధికార సహాయ కార్యక్రమాలను నిర్వహించింది. ఆమె చేసిన సేవలను కాంగ్రెసు గుర్తించి 1947 లో కార్యవర్గ సభ్యురాలుగా తీసుకున్నది. 1958 నుంచి 1960 వరకు కాంగ్రెసు ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించింది.

1946 లో రాజ్యాంగ పరిషత్తులోను తరువాత పార్లమెంటులోను ఆమె సభ్యురాలైంది. 1952, 1957 ఎన్నికలలో ఆమె పార్లమెంటుకు ఎన్నికైంది. పార్లమెంటుకు సంబంధించిన అనేక సంఘాలలో ఆమె పనిచేసింది.

1949 లో శ్రీమతి కృపలానీ సమితి సర్వప్రతినిధి సభా సమావేశానికి భారత ప్రతినిధివర్గ సభ్యురాలుగా హాజరైంది. 1958 లో టర్కీ దర్శించిన పార్లమెంటరీ ప్రతినిధి వర్గానికి ఆమె నాయకత్వం వహించింది. ఉత్తర ప్రదేశ్, మంత్రివర్గంలోచేరటం కోసం ఆమె 1960 డిశంబర్‌లో పార్లమెంటు నుంచి రాజీనామా చేసింది. ఉత్తరప్రదేశ్‌లో కార్మిక, సమాజ అభివృద్ధి, పంచాయితీ రాజ్ శాఖ ను నిర్వహించింది.

శ్రీమతి కృపలానీ, గాంధిస్మారకనిధి ఉపాధ్యక్షురాలు. వయోజన మహిళా విద్యా కేంద్రాలను నిర్వహించే నవహింద్ విద్యా సంఘానికి అధ్యక్షురాలు. ఢిల్లీలోని రెండు మహిళా కళాశాలల పాలక మండలులలో ఆమెకు సభ్యత్వం ఉంది. ఢిల్లీ మురికివాడలలో సంచార ఆస్పత్రులు ఉచిత ప్రాథమిక పాఠశాలలు మొదలైన సేవా కార్యకలాపాలను నిర్వహించే లోక కళ్యాణసమితికి సుచేత అధ్యక్షురాలు.

50 వ పడి మధ్యలోఉన్న శ్రీమతి కృపలానీ, అంత వయస్సున్నట్టు కనిపించరు.

చాలాదేశాల్లో పర్యటించి గొప్ప ప్రతిభ, ఉత్సాహాలతో గూడిన శ్రీమతి సుచేతా కృపలానీని ఆమె మిత్రులు మానవ యంత్రంగా వర్ణిస్తారు. ★

# దేశ రక్షణకై ఆయుధాలు
# ఎంత అవసరమో ఉత్పత్తి కూడా అంత అవసరమే!

# వనితా వాణి

## ఇడ్లీలు

ఎప్పుడూ మామూలు ఇడ్లీలు తిని తిని విసి గెత్తిపోతున్న మా కుటుంబానికి సుశీలా రామ శేషుగారి ''ఇడ్లీలు—రకాలు'' వ్యాసం ఎంతో ఆనందదాయకంగా ఉంది రోజు కొక రకం చేసుకుతిన్నా విసుగనిపించదు రచయిత్రికి మా ధన్యవాదాలు

ఎం సీత, ఎం సుగుణ (తెనాలి)

* * *

''ఇడ్లీలు—రకాలు'' వ్యాసం బాగున్నది వారికి పత్రిక ద్వారా అభినందనలు తెలుపు చున్నాను మేము కాంచీపురము ఇడ్లీ చేసినాము చాల బాగుగ వచ్చినది దయచేసి పత్రిక ద్వారా త్వరలో సాంబారు చేయు విధము తెలుపగోరతాను

స్వరాజ్యలక్ష్మి (అద్దంకి)

## రకరకాల బిస్కెట్లు

20—9—63 ప్రచురించిన రకరకాల బిస్కెట్లు బహుశా యిటీవల మీరు ప్రకటించిన అనేక వ్యాసాలకన్నా ఉపయోగంగా ఉంది నేను ఒకరకం చేశాను ఒక మోస్తరుగా కుదిరాయి రచయిత్రికి నా అభివందనలు

శాంతి (మద్రాసు)

## "పంజాబీల పరిణయం"

''పంజాబీల పరిణయం'' పై టి రామలక్ష్మి గారి విమర్శన (27—9—63) చదివి ఏడవాలో నవ్వాలో బోధపడలేదు పంజాబ్‌లో నివసించే 'సింద్' అనే తెగవారు పుట్టు వెంట్రుకలను తీస్తారు టి రామలక్ష్మిగారి దృష్టిలో పంజాబీ యులంతా ''సిఖ్కు'' ల వలె కనిపించా రనుకుంటూ చక్కని వ్యాసాన్ని వ్రాసినందుకు సుగుణాదేవి గారిని అభినందిస్తున్నాను

కుమారి కోమల (జనగామ)

* * *

27—9—63 ఆంధ్ర వారపత్రికలో 'పంజాబీల పరిణయం' వ్యాసాన్ని గురించి టి రామలక్ష్మి గారు రాసిన విమర్శ చదివి ఆశ్చర్యపోయాను వారి దృష్టిలో 'పంజాబీ' లంటే 'సిక్కు' లనే అభి ప్రాయం ఉన్నట్లుంది అవి పొరబాటు పంజాబీ లంతా 'సిక్కు' లే కారు

నిర్మల (కొత్తఢిల్లీ)

వారు తప్పుగా భావించినారు పంజాబీలకు వెంట్రుకలు తీస్తారా అని సందేహ పడినారు డి. రామలక్ష్మి గారికి పంజాబీలలో రెండు రకములవార్లు ఉంటారని తెలియదు హిందువులు, సిక్కులు. సిక్కులు కత్తిని దగ్గరకు రానీయని సంగతి అందరికీ తెలిసినదే కాని, హిందువులు పుట్టు వెంట్రుకలు తీస్తారు

రత్న (రాంచిగా)

* * *

6—9—63 పత్రికలో ప్రచురితమైన 'పంజాబీల పరిణయం' వ్యాసంమీద, 27—9—63 పత్రికలో టి రామలక్ష్మి (పాలకొల్లు) గారికి బహుశా పంజాబీలలో రెండు తెగ లున్నాయని తెలియదేమో! అందులో ఒక తెగ పుట్టింది మొదలు చచ్చే వరకు మంగలి కత్తిని దరిచేరనివ్వరు ఇంక రెండవ తెగ—అదే రామలక్ష్మిగారికి బహుశా తెలియనిది—చిన్న పిల్లలకి జుట్టు తీయించే తతంగం నుంచి, అతి నాజూకుగా క్రాపు చేయించుకునే వరకు !!! అందుచేత సుగుణగారు వ్రాసింది ఈ తెగనుద్దేశించే !

వి కమలాప్రసాదరావు (కొత్మా)

## చదువమ్రావ - బి. వి. సత్యమూర్తి












**శ చీపోసి కట్టిన చీర, చంకలో గంప, ఒక చేతిలో సోదిబుర్ర కుడిపైట, ముక్కుకు బులాకీ, మొహాన అర్ధ రూపాయంత కుంకుమ బొట్టుతో**

ఎరుకలసాని వేషంలో శశి స్టేజిమీద అడుగు పెట్టగానే మా ఉమ్మన్స్ కాలేజి డ్రామా హాలులో హర్షధ్వానాలు మిన్నుముట్టినయి అవి మా కాలేజి వార్షికోత్సవాలు 'పద్మావతీ పరిణయం' నాటకంలో గౌరీదేవి ఎరుకలసాని వేషంలో ధారుణీదేవికి, పద్మావతికి ఎరుక చెప్పే సీను అది

నాటకం రాసి లెక్చరరుగారి కిచ్చేటప్పుడే ఎరుకలసాని పాత్రకు శశి పేరు సూచించాను ఆమె ఒప్పుకున్నారు శశి చామనచాయ రంగు తీర్చైన కన్ను ముక్కు, అమరినట్లుండే విగ్రహం, ఆ కళ్ళలోని కళ, ఆ పాత్రకు శశి చక్కగా ఉంటుందని భావించే తనను దృష్టిలో పెట్టుకునే ఆ పాత్ర పలికిన ప్రతి మాటా రాశాను

ఇదే తొలి అనుభవమైనా తొణుకు బెణుకూ లేకుండా అడుగు పెట్టింది స్టేజిమీదకు పాత్రలో లీనమయి అద్భుతంగా నటిస్తుంటే అల్లరిపిల్ల శశేనా ఇది అనిపించింది కాని తను దైవ ప్రార్థన మొదలు పెట్టగానే మాత్రం నా గుండెల్లో ఆటంబాంబు ప్రేల్చినంత పనవడం మాత్రం నిజం! ఎందుకంటే—"వ్రాసి ఇచ్చిన తల్లే కమలమ్మతల్లే ప్రాంప్టింగందడం లేదు నేనేమిసేతో" అని "నన్నెంచుకున్నందుకు నీ పరువు తీస్తానుండు" అంటుండేది రిహార్సల్సులో అన్నా అనే రకమే అదురూ బెదురూ లేని ఘటం అనుకొన్నాను కానీ—దాని పుణ్యమా అని అలాంటిదేమీ చెయ్యలేదు.

తల్లి దండ్రు లెవరో తెలియదు ఆస్తిపాస్తులా అసలేవు దారినపొయ్యే దానయ్య ఎంతటి నవమన్మధాకారుడైతేమాత్రం కూతుర్నివ్వడానికి మన సొప్పుతుందా? సంశయాకుల చిత్త ధారుణీదేవి, ప్రియా విరహ పరితప్త పద్మావతి ఇద్దరినీ ఏక కాలంలో మెప్పించాలి. డ్రామా జయం అంతా ఈ పాత్రమీదనే ఆధారపడి ఉంది ధారుణీదేవి యెడల అణకువ, వినయమూ, పద్మావతియందు స్నేహాభిమానాలు కనబరుస్తూ పాత్రకు ప్రాణం పోసింది శశి ధారుణీదేవి సంశయాలు తొలగించి పద్మావతికి ఊరట కలిగిస్తూంది శ్రీనివాసుని ఓ ఇంటివాణ్ని చెయ్యాలన్న ముక్కోటి దేవతల

సత్సంకల్పానికి ఈ విధంగా కార్యరూప మిచ్చిన ఎరుకల సానిగా శశి చూపిన హావ భావాలు, నటనా చాతురీ అటు పెద్దల ఆశీస్సులను ఇటు ప్రేక్షకుల మన్ననలు చూరగొన్నాయి

శశి ప్రథమ బహుమతిని అందుకుంటున్నప్పుడు కరతాళ ధ్వనులతో హాలు ఐదు నిముషాలవరకు మారుమ్రోగింది 'మృదు మధురమైన శైలిలో పేరొందిన పౌరాణిక గాథను హృదయ రంజకంగా నాటక రూపంలో అందించిన కుమారి కమలకు, అ'గానే నా కాళ్ళూ చేతులూ వణికినయి. నాకు చచ్చేటంత సభాపిరికి ...బహుమతి నందుకుని నాటకం విజయవంతం కావడానికి తోడ్పడిన పాత్రధారులకు, ముఖ్యంగా రసవత్తరమైన ఘట్టంలో రక్తి గట్టించే విధంగా నటించిన శశికళకు, కంపిత స్వరంతో ఎలాగో కృతజ్ఞతలు తెల్పుకుని బయట పడ్డాను ఇవ్వాళ అరుణ వచ్చుంటే ఎంత బాగుండేది?......ఎందుకు రాలేదో తను అనుకున్నాను.

* * *

సాయంత్రంపూట అమ్మకు కూర తరిగి పెడుతున్నాను అమ్మకు నా పని నచ్చనే నచ్చదు. "అదేం తరగడమే? రామ! రామ!" అని అమ్మ విసుక్కుంటోంది అసలు ఆవిడకు ఆడపిల్లల చదువులంటేనే గిట్టదు స్కూలుఫైనలు కాగానే నన్నో ఏడు చదువు మాన్పించేసింది. కానీ నా పోరు పడలేక (మన్లోమాట—మరెక్కడా అనకండేం!) తనకు నచ్చి, నన్ను మెచ్చిన సంబంధం దొరక్క కాలేజిలో చేర్పించింది ఏ మాట అంటే ఏం కోపంవచ్చి 'రేపటినుండి నీకు కాలేజిలేదు గడ్డలూలేదు!' అంటుందోనని గుండెలు పీచు పీచుమంటుంటయి.

ఇంతలో "కమలా! .." అంటూ వచ్చింది శశి

"ఆ! ఈ తరిగింది చాలుగాని, ఆ అమ్మాయొచ్చింది వెళ్ళు" అంటూ కత్తిపీట లాక్కుంది అమ్మ. "బతికాం" అనుకొని పాకశాలనుంచి బయట పడ్డాను.

"అరుణ హిస్టరీ నోట్స్ ఇస్తానంది వెళ్ళొద్దాం రావే" అంది శశి

"నేనూ వెళ్ళాలనుకొంటున్నాను నిన్న కూడ ఎందుకో కాలేజికి రాలేదు తను పోదాం పద" అంటూ, "ఇప్పుడే వస్తామని" అమ్మతో చెప్పి బయలు దేరాం.

శశికళ పెద్ద "బిజినెస్ మాన్" కూతురే అయినా మంచి పిల్ల. అందరితోనూ కలుపుగోలుగా ఉంటుంది. మేమిద్దరం అరుణా వాళ్ళింటికి వెళ్ళేసరికి తను వాళ్ళ ఇంటిముందు తోటలో కూచుని చదువుకుంటోంది. వాళ్ళ నాన్నగారు ఆ వూర్లో పేరు పొందిన డాక్టరు. తను మమ్మల్ని చూడలేదు. శశి నాకు సైగచేసి మెల్లిగా అడుగులో అడుగేసుకుంటూ వెళ్ళి కళ్ళు మూసేసింది. అరుణ ఉలిక్కిపడి చేతులు తడుముతూ, "అబ్బ! కమలా! వదలవే నీకు పుణ్యముంటుంది" అన్నది.

శశి చేతులు తీసేసి, "నన్ను మర్చిపోయినందుకు బహుమతి" అంటూ మొట్టికాయవేసి పక్కనే కూచుంది సిమెంటు అరుగుమీద. నేనూ పక్కనే కూచున్నాను

"అరుణాదేవిగారూ ఒక్కక్షణం ఈ పుస్తకం మూసెయ్యండి. కావాలంటే రిజిస్ట్రారుగారికి 'యూనివర్శిటీ ఫస్టు మా కెవ్వరికీ వద్దు. మా అరుణ కివ్వవలసిందని' రికమెండ్ చేస్తాలే" అంటూ పుస్తకం లాగేసింది శశి

"అరూ! చక్కటి సాయంత్రంగదా! పకృతి పుస్తకంలోని ఈ అందమైన పటం చూడకుండా ఆ పుస్తకం ఏమిటే? సంధ్యారాగంలో ఈ తోటలో చెట్లు చూడు బంగారు కోనేటి నీటిలో స్నానం చేస్తున్నట్లు మిల మిలా ఎలా మెరుస్తున్నయ్యో!.."

"ఫోర్టీన్ కారెట్స్ కోనేరా? లేక ట్వంటీ టు కారెట్స్?......" శశి సందేహం !

"పుస్తకం తెరిచానేగానీ—మనసిక్కడ లేదే...." మా మాటలు వినిపించుకోనట్లే అంది అరుణ. తన ముఖం ఎందుకోగాని ముకుళించిన కమలంలా ఉంది.

"కొంపదీసి అటు లడక్ వైపు వెళ్ళిందేమిటి?" నేను నవ్వుతూ అన్నాను. వాళ్ళ బావ రాజుకు మిలిటరీలో ఉద్యోగం. లడక్‌లో ఉంటున్నాడు ప్రస్తుతం.

"ఛా! అదేంకాదు..... లక్ష్మికి పెళ్ళిట!....." అంది చాలా మెల్లిగా.

"సరిపోయింది! కొండను తవ్వి ఎలుకను పట్టినట్టు ఇందుకా 'పుట్టి' మునిగినట్టు మొహం పెట్టుక్కూర్చున్నావ్!......

"తనకంటే ముందు అయిపోతోందని దిగులు కాబోలు!......" శశి వ్యాఖ్య.

"ఎవరికిచ్చి అనుకుంటున్నావ్?" అరుణ చాలా సౌమ్యంగా అడిగేసరికి కథ అడ్డం తిరగలేదు కదా అనే అనుమానం వేసింది నాకు. లేకుంటే ఇంతేసి మాట లన్నందుకు మా ఇద్దరిచేత అధమం చెరి పది గుంజిళ్ళు అయినా తీయించి ఉండేది. అనుకుంటూ, "మీ బాబాయి కొడుకు గోపీ కిస్తారని అంటుండే దానివిగా......" అన్నాను

"కాదు. వాళ్ళ మేనత్త కొడుకు సుందరానికిచ్చిట!......" అరూ బరువుగా నిట్టూర్చింది.

"ఆ!!!......" అన్నాను. ఒక్కమాటు గుండెలమీద బరువు పెట్టినట్లయింది లక్ష్మి మా క్లాస్‌మేట్. హైస్కూల్లో. అరుణకు మేనత్త కూతురు మేమందరం ప్రాణస్నేహితులం. లక్ష్మి చిన్నప్పుడే తల్లి దండ్రుల్ని పోగొట్టుకున్న అభాగిని. వాళ్ళ బామ్మ పెంచి పెద్ద చేసింది. వాళ్ళ సుందరం బావను కూడ నేను చూశాను. చిన్నప్పుడే తండ్రి పోయినందున ఒక్కడే సంతానం కావడంచేత వాళ్ళమ్మ గారాబం చేసింది. చదువు సంధ్య వంట బట్టలేదు. వాళ్ళమ్మ మహా గయ్యాళి. ఆ తల్లీ కొడుకుల్ని చూస్తే నాకు చిలక మర్తివారి 'గణపతి' 'సింగమ్మ' జ్ఞాపకం వస్తారు. అదీకాక—లక్ష్మి వాళ్ళ మేనమామ కొడుకు గోపీమీదనే మనసు నిల్పుకుంది. వాళ్ళ ప్రేమను గురించి వాళ్ళ బామ్మగారి చెవిదాకా పోకపోయినా మా మిత్రబృందమంతా ఎరుగుదుము.

నాకు తెలియకుండానే దీర్ఘవిశ్వాసం వచ్చేసింది. "అయితే లక్ష్మి ఏమంటోంది?... ." అని అడిగాను.

"నా శవానికి కట్టిస్తుందిలే బామ్మ తాళిబొట్టు అంటోంది."

హరి! హరి! అది సహజంగా నోరు జారదు. నిండుకుండలాంటి మనిషి. నాకు భయం వేసింది. "పోనీ ఈ విషయమంతా వాళ్ళ బామ్మకు చెప్తే సరి. తల్లీ తండ్రీ తనే అయి పెంచిందికదా. కాదంటుందా?......."ఆశారేఖలు కల్పించుకొంటూ అన్నాను.

"లాభంలేదు" తల అడ్డంగా తిప్పుతూ "ఆవిడ గుణం ఎరగందా?... " అన్నది అరూ.

"లక్ష్మంటే ఆవిడకు పంచప్రాణాలు. చెప్పే తీరులో ఆవిడకు నచ్చచెబితే దాని ఇష్టాన్ని ఆవిడ ఎప్పుడూ కాదనదు." నా వూహను సమర్థించుకుంటూ అన్నాను.

"నేను చెప్పిన వాడ్ని ఎట్లా చేసుకోకుండా పోతుందో చూస్తానంటూ దాన్ని ఏ స్తంభానికో కట్టేసినా కట్టేస్తుంది. లేనిపోని అగచాట్లు దానికల్పించడం" అరుణ పెదవి విరిచింది.

"పెద్ద చిక్కే వచ్చిందే?......" అని ఆలోచిస్తున్నాను నేను.

"ముందు అన్నయ్య ముఖం చూడలేక పోతున్నానే. నోరిప్పి ఏమీ అనకపోయినా వాడి దంతా స్వయంపాకం. పిచ్చి రూపుగా తయారయా డనుకో" అరుణ కళ్ళు వర్షిస్తున్నాయి. రుద్ధమైన కంఠంతో అంటుంటే నా కళ్ళూ చెమర్చినయి. కళ్ళొత్తుకుంటున్న మమ్మల్ని చూచి శశి నవ్వింది.

"మేము బాధ పడ్తుంటే నీకు నవ్వుగాఉందా" అరుణ బాధగా అంది.

"ఏడిస్తే బాధలు పొయ్యేటట్లయితే ఎడాతెరిపీ లేకుండా ఏడు రోజులు ఏడ్చి పెట్టగలను"

"ఆడదాన్ని అంతకంటే ఏం చెయ్యగలను. సానుభూతి చూపగలను" అరూ నిస్సహాయంగాచూస్తూ అన్నది.

"ఇన్సల్ట్! సానుభూతేం ఖర్మ! సహాయమే చేస్తాం! పత్రికల్లో వారానికో కథ చదవటల్లా? ప్రేమాయణంలో ఫ్రెండ్స్ సలహాలు, సహాయాలు గురించి. అన్ని రంగాల్లోనూ పురుషులతోబాటు ముందడుగు వేసిన యువతీ లోకం ఇందు వెనకబడ్డమా?.... .అరూ! నీకేందుకే ఇంతమంది ఫ్రెండ్స్ మున్నాం. లక్ష్మి గోపీల పెళ్ళి జరిపించాల్సిందేనేమనం" ఆవేశంగా దృఢ ప్రతిజ్ఞ చేశాను.

అరుణ కళ్ళల్లో విద్యుత్తు వెలిగింది. ఆశగా చూస్తూ, "ఆలోచనల మెదడు మళ్ళే ప్లాను వెయ్యాలి" అంది నా చేతులు పట్టుకుని ప్రబతిమాలుతూ.

'ఆలోచనల మెదడు' 'వూహాగాయని', 'పిచ్చిపిల్ల' లాంటి ఎన్నో పేర్లు నాకు కాలేజీలో. మా ఫ్రెండ్స్ కమలా సహస్ర నామావళి అంటుంటారు. ప్రతిజ్ఞ ఐతే చేశానుగాని ఇడియా మాత్రం ఓ పట్టాన రాలేదు. చివరికి "ఆ సుందరంగారికి మనమో ఆకాశ రామన్న లేఖ వ్రాస్తే?......" అడిగాను అరుణకి.

"సరిపోయిందే! రామాయణమంతా విని రాముడికి సీతేం కావాలన్నట్టు. అతడికి ఆమాత్రం ఆలోచన, స్వతంత్ర ఉంటే ఇంకేం? అతడు అమ్మకు చూపడం, ఆవిడ ఆగ్నేయాస్త్రం వదిలితే ఇక్కడ బామ్మగారు అగ్గి అవడం, అందులో మన లక్ష్మి బుగ్గి అవడం!... ." అరూ ముఖంలో మళ్ళీ నిరాశ ప్రతిఫలించింది.

"ఈ సంగతంతా వ్రాసి ఈ సంబంధానికి ఒప్పుకోకపోతే 'బ్లాక్ మెయిల్' చేస్తామని బామ్మగార్ని బెదిరిస్తే? . ."

"ఈ ఉడుతూపులకు బెదిరే ఘటం కాదోయ్ ఆవిడ! ఆవిడ శీలం వర్ణించమంటే—తన మాటకు ఎదురు చెబితే సహించలేదు. మాట పట్టింపులూ, పట్టుదలాకూ తప్ప ఆవిడ దృష్టిలో మనసులకూ

మమతలకో విలువేలేదు మా అత్తయ్య పెళ్ళిలో ఏదో మాటా మాటా వచ్చిందిట కోడల్ని పుట్టింటి గడప తొక్కనివ్వలేదు గదా చివరికి మా అత్తయ్య పోయినప్పుడు మా వాళ్ళు పసుపు కుంకుమ పట్టుకెళ్ళినా పలుకరించిన పాపాన పోలేదుట ఈమధ్య లక్ష్మి పెద్దదయ్యాక ఈమాత్రం రాక పోకలు ఇక మూఢనమ్మకాలు ఆచారాలు అంటూవ్ కొకొల్లలు లక్ష్మిని నిండు నెలలు కడుపుతో

## "హోరి పిడుగుల్లారా!!!

ఉన్నప్పుడు వాళ్ళ నాన్న పెద్ద త్రాచును చంపాడట అదెక్కడ పాపం చుట్టుకుంటుందోనని పెద్ద శాంతి చేయించి మనుమరాలికి నాగలక్ష్మి అని పెట్టుకుందిట మా వాళ్ళ ఆవిడ ఈ నమ్మకాలూ అవీ చెప్పుకుని నవ్వుకుంటుంటారు' అని చెప్పుకుపోతోంది అరుణ

మెరుపులా తట్టింది ప్లాను గబుక్కున తన చెవిలో చెప్పాను రహస్యంగా అరుణా ఎగిరి గంతేసి శశీ నువ్వు ఎవరికో సహాయం చెయ్యాలే' అంది దాని భుజం పట్టుకుని

'పరోపకారార్ధ మిదం శరీరం'' త్యాగధనునిలా పోజు ఎట్టి కూచున్న శశి చెవిలో ఈ సంగతి చెప్పగానే హా రామ్! మూర్ఛ! ఏదీ సోడా? మంచినీళ్ళు '' అంటూ వెనక్కు వాలింది.



"ఇందాక అన్నది ఉత్త గొప్పకే! " లేవ దీ ఎ...పు...ుగా కూచోబెట్టాను

"ఇదుగో మీకంతగా నన్ను చంపెయ్యాల్నుంటే ఈ బి ఎ అయిపోయాక చంపండి అప్పుడు ఫలానా సాహస కార్యంలో శశి బి. ఏ గారు మర ణించారని వార్తలలో వెయించవచ్చు. అంతేగాని— పక్కన డిగ్రీ లేకుండా నేను చావనమ్మా" శశి మూతి ముడుచుకుంది.

"పోన్లే 'కుమారి శశికళ సెకండ్ బి. ఎ. మర ణించారని తెలుపుటకు విచారిస్తున్నాం' అంటా ఓ సంతాప గీతంతో సహా 'రేడియో సిలన్'లో చెప్పిస్తాంలే" అన్నాను నవ్వుతూ.

"నువ్వు నూరు చెప్పు. లక్ష చెప్పు. నాకు బామ్మగారంటే డిటెక్టివ్ నవలంత భయం!"

"ఆవిడకూ వాటికీ ఏం పోలికే....."

"డిటెక్టివ్ నవలలు చదివితే రాత్రి కల్లోకి శవాలు, రక్తపు మడుగులూ వచ్చినట్టు బామ్మ గార్ని చూస్తే పెద్ద పులులు, సింహాలు కల్లో కొస్తాయి. ఆవిడ, లక్ష్మి ఎక్కడికో వెళ్తుండగా ఓ మాటు చూశాన్లే "

"మహారాణిని ఆపదనుండి కాపాడడానికి తిమ్మన కవి పెద్ద ప్రబంధం రాశాట్ట కష్టపడి! ఆపదలో అడ్డుపడగలిగినప్పుడే కళకు సార్థకత నువ్విలా భయపడుతున్నావంటే అది నీలోని కళకే అవమానం! కళా సరస్వతికే తీరని తలవంపులు! " ఆవేశంగా చిన్న ఉపన్యాసం దంచేసేసరికి "సరే కానిండు" అంది పెద్ద పోజులో శశి

"ఇది చాలా రహస్యంగా మనలో మనం అన్ని ఏర్పాట్లు చేసుకోవాలి బయటికి పొక్కగూడదు సుమా! గోడలకు చెవులుంటాయి" అన్నాను శశితో

"గోడలకు చెవుల మాట దేవు డెరుగుకానీ— నీ బీరువాలో కాగితాలకు మాత్రం కళ్ళుంటయి కథల్లోకి ఎక్కించకు తల్లీ!" నవ్వుతూ శశి అన్నది

"అప్పట్లు మీ అన్నయ్య ఏదో ఎమెచ్యూర్ డ్రమెటిక్ ఎసోసియేషన్ సెక్రటరీ లన్నట్టు న్నావు ఎప్పుడో? " ఆలోచిస్తూ అడిగాను

"అవున"ని తలూపింది శశి

"మూడు కావస్తున్నదే" అనుకుంటూ గబగబా బయల్దేర బోతున్నాను ఇంతలో "ఎక్కడికే?" దొడ్లోంచి అమ్మ కేక విని "భగవాన్! ఆదిలోనే హంసపాదా!"అనుకుంటూ అరుణ అనబోయి "లక్ష్మి వాళ్ళింటికి" అనేశాను చటుక్కున. వేధపది అబద్ధం అవసరానికి హాతం వేస్తుంది!

"ఇంత ఎండలో అంత దూరం ఎందుకే?" అంటున్న అమ్మకి "లక్ష్మి ఎందుకో రమ్మని కబురు చేసిందమ్మా. ఎండ ఉండగావెళ్తే చీకటి పడేలోగా వచ్చెయ్యొచ్చుగా" అని కారణం చెప్పుకున్నాను. ఎక్కడవిందో మా పాము చెవుల తల్లి "అమ్మా! నేనూ వెళ్తానే అక్కయ్యతో బాటు" అంది. నాకు ఒళ్ళుమండి "ఆ నువ్వేం అక్కర్లేదులే" అన్నాను. "ఒద్దుట ఒద్దు! పెళ్ళి గానిపిల్ల ఒంటరిగా తిరుగుతుంటే నలుగురూ నా నోట్లో ఉమ్మేసారు నీకేం?......రాధా! వేరే పరికిణీ కట్టుకు వెళ్ళమ్మా" అంటూ అమ్మ ఆర్డరు జారీ చేసింది. ఎలాగూ విఘ్నం జరి గింది గదా అని లోపలికి వెళ్ళి కాళ్ళు కడుక్కుని

47 వ పేజీ చూడండి

# ప్రేమ గొలుసు

వీరాజీ

## జరిగిన కథ

సురేఖను భాస్కరానికీ భాస్కరాన్ని సురేఖకు పరిచయం చేస్తుంది, పద్మావతి భాస్కరం సవతి తల్లి జానికమ్మగారు అతన్ని కన్నబిడ్డ కంటె ఎక్కువగా ప్రేమిస్తుంది భాస్కరానికీ, కూతురు వసంతకూ ఒకేసారీ వివాహం చేయాలని ఆమె ఆరాట పడుతుంది తత్ఫలితంగా భాస్కరాన్ని పెళ్లిచూపులకు బలవంతంగా ఒప్పించి తీసుకెళ్తుంది పెళ్లి కూతుర సురేఖ అని తెలియగానే భాస్కరం మనస్సులో కల్లోలం చెలరేగుతుంది సురేఖ దొడ్డమ్మ అయిన ధనమ్మకు మాత్రం భాస్కరంలో అన్నీ మంచి గుణాలే కన్పించి ఎలాగైనా భాస్కరాన్ని తన అల్లుడుగా చేసుకోవాలని పటు దల పెరుగుతుంది భాస్కరం పద్మావతిని ప్రేమించడం నిజమా, కాదా అనే సందేహం కూడా సురేఖకి కలుగుతుంది ధనమ్మక దూరపు బంధువు ముకుందరావును వసంతకు ఇచ్చేటట్లు కూడా అప్పుడే ఏర్పాటు జరుగుతుంది తను సురేఖను వద్దంటే ధనమ్మ తన కూతురుకే ముకుందరావును ఇచ్చి చేస్తానంటోంది చెల్లెలి సంబంధం తన మూలంగా చెడిపోతుందని భాస్కరం, ముకుందరావుని వివాహం చేసుకుందామని కల్లో గూడా అనుకోని సురేఖకు తను భాస్కరాన్ని వద్దంటే ధనమ్మ తనను ముకుందరావు కిచ్చి చేస్తుందేమో అన్న భయంతో సురేఖా ఎటూ మాట్లాడలేకపోతారు చివరకి భాస్కరం తన పెళ్లి ఏడాది వాయిదా వేస్తాడు ఇంతలో యూనివర్సిటీ తెరుస్తారు సురేఖ, పద్మ యిద్దరూ ఎం ఏ లో చేరతారు భాస్కరం కూడా ఫె నలియర్ పూర్తి చేయటానికి వస్తాడు సురేఖ అంతా చెప్పిఉంటుందని భాస్కరం అనుకొని పద్మతో ఏమీ చెప్పలేకపోతాడు ఎగ్జిబిషన్‌లో కూడా పద్మావతిని కల్సుకొని ఎలాగైనా జరిగింది చెప్పాలని చాలా ప్రయత్నించాడు భాస్కరం భాస్కరం స్నేహితుడు మూర్తి శైలజను ప్రేమిస్తాడు శైలజ కూడా పద్మవతికి సురేఖకు స్నేహితురాలు పిక్‌నిక్‌కు వెళ్ళారంతా పద్మావతి అలిగింది సురేఖ అనునయించింది వసంత పెళ్లి జరుగుతోంది అక్కడ

ఓ.

## 41

ఇళ్లోకెళ్లటం రావడం, స్నేహితులూ లేదా పరిచయస్తులు ఎవరేనాతప్ప, పదిమందీ పది రకాలుగా ఉండే చోటకు పేరంటానికనీ, పెళ్లి కనీ రావడం పడనే లేదు

ఇదివరకోసారి గుంటూరులో వాళ్ల 'క్లాస మేటు' జయంతి వాళ్ల యింట్లో బొమ్మలకొలువు పెట్టేమంటే పద్మావతి సంబరపడి వెళ్లింది

చాలాసేపూ పడుచుదనం గల పిల్లలంతాకలిసికులాసాగా గడిపేశారు కాని అంతలో ఒక ముత్తయిదువ "ఇంతకీ జయా! అడిగానని ఏమీ అనుకోకూ! ఆ అమ్మాయి ఎవరే మరీ అలా నవరత్నాలూ రాలుతున్నాయన్నట్లు అలా గర్వంగా నవ్వుతోందీ ?" అని అడిగింది జయంతిని

ఈ మాటలు విన్న పద్మావతి అప్పటికే నొచ్చుకుంది పైగా "మా ఫ్రెండు" అని జయంతి చెప్పడం పూర్తికాకుండానే ఆవిడ మరింత చనువుగా "ఆహా యీ వూరేనా?" అన్నది సూటిగా పద్మావతిని చూస్తూనే

"ఈ వూరే నన్నది" పద్మావతి

"మీ నాన్నగారేం చేస్తుంటారు ?"

"వాళ్ల నాన్నగారు పోయారు దొడ్డగారూ" జయంతి చెప్పింది

"అయ్యో! పాపం!" ఆవిడ విచారించి "అలాగా, మరి అన్నదమ్ము లున్నారా ?" అన్నది అలా రకరకాల ప్రశ్నలు అడిగింది

"మరి పెళ్లి చెయ్యరూ ? ఈ చదువులెందుకు చెప్పూ!" అని వ్యాఖ్యానించింది

'దవడమీద ఒక్కటి యిద్దునా ?' అని ఆనాటి నుంచి ఈనాటి వరకూ ఆ సంఘటన జ్ఞాపకం వచ్చినప్పుడల్లా అనుకుంటుంది పద్మావతి

సురేఖను దగ్గరిగా అంటిపెట్టుకొనే తిరుగుతున్నా, లోపల లోపల పద్మావతికి 'తను ఈ పెళ్లివారికి చాలా దగ్గర దానిని' అనే ఆలోచన మాత్రం సాధిస్తూనే ఉంది

వాస్తవానికి యిక్కడ పెళ్లి సందడిలో సగం తనూ పాలు పంచుకోవాలి కాని ఎవరన్నారు ఆమాట ? అసలీ పద్మావతిని ఎవరెరుగుదురు ?

"సురే! నాకు అదోలా ఉందే"

"నువ్వు తప్ప ఎవ్వరూ తెలియరూ ?" అన్నది నిజానికి పెళ్లికి వచ్చినవారిని ఎవరివేపు వారెవరూ ?" అనేదిచూసి పల్కరిస్తారు. కాని, నేరుగా సురేఖ నేస్తంగా వచ్చిన పద్మావతికి—తానే ప్రయత్న పూర్వకంగా, తప్పించుకు తిరగడంవల్ల భాస్కరం వూపిరిసలపని హడావుడిలో ఉండటం వల్ల, సురేఖ తప్ప ఎవ్వరూ తెలియడంలేదు

"సరేలే, నాకూ అంతే! మా దొడ్డమ్మని చూశావుగా రా! వాళ్ల పిన్నిగారిని చూద్దువుగాని, ఆనక వసంతని చూద్దాం"

సురేఖ చొరవగా జానకమ్మగారున్న దిక్కుగా వెళ్లింది ఆమె "వీళ్లిద్దరూ తనవేపు చూస్తున్నారు "ఒకవేళ నాకోసరమా ?" అనుకుని యిటు తిరిగి "ఏమమ్మా! నా కోసమా ?" అన్నది సురేఖ నుద్దేశించి

"నమస్కారమండీ! మీ కోసమే" నంది సురేఖ. అని "ఈమె పద్మావతి అండీ!" అన్నది. జానికమ్మగారిని చూస్తూనే అదో బిడియం కలిగింది యిద్దరికీ

"అలాగా! అమ్మాయ్! నువ్వు యిక్కడ ఏ సదుపాయంలేకపోయినా నాతో చెప్పు మొహమాట పడకు!" అని పద్మావతిని చూసి, సురేఖ కేసి తిరిగి "మీ స్నేహితురాలా ?" అన్నది పద్మావతి అంటే ఆమెకేం తెలుసూ ?

తలూపింది సురేఖ—పద్మావతి చేతులు జోడించింది అంతలో ధనమ్మగారు విసవిసా వచ్చింది అక్కడికి!

"అయ్యో! ఒదినెగారూ! మర్చిపోయాను, మీ సురేఖను రాగానే మీదగ్గర అప్పచెప్పాల్సింది" అంటూనే పద్మావతిని చూసి "ఆహా! అమ్మాయ్ పద్మకుమారీ! నువ్వూ ఉన్నావా తల్లీ!" అని తిరిగి "చూడూ! ఈమె పెళ్లికుమార్తె తల్లి—ఆమాటకొస్తే నాకు కాబోయే వియ్యంకురాలనుకో! సురేఖ అత్తగారు" అన్నది గర్వంగా

"బాగున్నారు ఇద్దరూ" అన్నది జానికమ్మగారు అమ్మాయిలను కలిపిచూసి

సురేఖ "దొడ్డమ్మా! యీమె పేరు పద్మకుమారి కాదు, పద్మావతి" అని చెప్పలేదు పద్మకుమారి అనగానే వచ్చిన నవ్వు కూడా సగంలోనే చెరిగిపోయి ఆమె నుదుట నెత్తురు లేనట్లు పాలిపోయింది కూడా!

పద్మావతికి భూమి క్రుంగుతున్నట్లుంది.

ధనమ్మగారి ధోరణి వేరు

"ఈ ఎద్మకుమారి వాళ్లది గుంటూరట !" అంటూనే ఆమె పద్మావతిని చూసి "నువ్వు నీ స్నేహితురాలి పెళ్లికి కూడా వారం రోజులు ముందుగానే రావాలిసుమా !" అన్నది

"అబ్బబ్బ ! " అన్నది సురేఖ ఎంత నిగ్రహించుకున్నా దాగలేదు భావోద్వేగం సురేఖకు ధనమ్మగారి నోరు నొక్కేద్దామా అనిపించింది అంతలో "అయ్యో ! చూశారా ! రండి ! రండి ! నా మతి ! మిమ్మల్ని పిల్చుకెళ్దామని కబుర్ల మధ్య పడ్డాను " అంటూ ధనమ్మగారు గభిక్కున చనువుగా జానికమ్మగారి చెయ్యి పట్టుకుని తీసుకు వెళ్లిపోయింది

పద్మావతికి నెత్తురు మరిగిపోతున్నంత కోపం వచ్చింది నేలకు క్రుంగిపోతున్నంత దుఃఖం కలిగింది పెదాలు ఒణుకుతూ ఏమీ తప్ప విడటంలేదు

సురేఖ అనుకోని అఘాత మిది ! పద్మావతి వేపు చూడటానికే ధైర్యం చాలలేదు—ఎట్ట కేలకు "రా !" అన్నది

పద్మావతి గిరుక్కున అటు తిరిగింది

"కదిపితే కన్నీళ్లయిపోతుంది!" ఏం చెయ్యాలి? సురేఖ పరిస్థితి కూడా ఆందోళన ఆందోళనగానే ఉన్నది !

పద్మావతి "ఛీ" అనడం పూర్తిగా వినిపించ లేదు గాని, ఆమె తొట్రుపాటుగా వెళ్లిపోతూండటంతో నలుగురి దృష్టిని ఆకర్షించనంత జాగర్తగా ఆ పిల్లతోనే వెళ్తున్నట్లు వెళ్లింది సురేఖ కూడా !

"అందరూ దగాకోరులే ! .. ప్రపంచమే దగా .. వీళ్లంతా దగాకోరులు "

మధ్యలోనే అందుకుని సురేఖ "నువ్వు ఆవేశం తగ్గించుకోడం మంచిది పద్మావతి !" అన్నది గట్టిగా

"థాంక్స్ ! నువ్వూ నీ కాబోయే పెళ్లి కుమారుడూ ఉండండి—ఈ అవమానం చాలు "

"షటప్ ! యూ ఫూల్" సురేఖ కళ్లల్లో నీళ్లు నిప్పులూ రెండూ నిండిపోయాయి

"గోటూ హెల్ !" పద్మావతి పెట్టె తీసుకుని చకచక వెళ్లిపోయింది

సురేఖ మంచంమీద కూలిపోయి వెక్కి వెక్కి ఏడ్చింది !

పద్మావతి దెబ్బతిన్న పాములా తప్పించుకుని పారిపోయినట్లు వెళిపోయింది

అంత పెళ్లి సందడిలోనూ తప్పించుకుని, రిక్షా ఎక్కి స్టేషనుకి వెళ్లిపోయింది




పద్మావతి బుర్రలో సుత్తి దెబ్బలు కొడుతున్నట్లు అనే మాటలు. మనసులో దుఃఖం.

"ఛీ ! స్నేహం ? .. అదీ దగా ! ప్రేమా ? వచ్చి మోసం "

గదిలోకి వెళ్తూనే సూట్‌కేసు తీసుకుంది ఉన్నపళాన మూత తెరిచి గట్టిగా వేసి భగభగ మండిపోయే కనులెత్తి ఒకసారి సురేఖను చూసింది.

"చూడూ ! . .." సురేఖ నిగ్రహంతో వారించబోయింది

"అక్కర్లేదు " విదిలించుకుంది పద్మావతి ...

"ఇలా వెళ్లిపోడం బాగుండదు . "

సురేఖ మెత్తగా బతిమాలుతున్నది.

"ఎవరికి బాగుండదు ? అసలేది బాగు ? ఇంత నాటకమాడి, ఇలా ఇంత డ్రమటిక్‌గా నన్ను వంచన చేయడం బాగుందా ? నన్ను, నన్ను ఒక కీలుబొమ్మగా చూసి " బుసకొడుతూ నిగ్రహం కోల్పోయి తడబడుతూ మాట్లాడుతోంది పద్మావతి

"చూడటమే గాక పిలిచి .... యిలా .యిలా..."

స్నేహానికి పరీక్ష, ప్రేమకి పరీక్ష, విగ్రహానికి పరీక్ష అన్నీ పరీక్షలే ..... వెధవ పరీక్షలు . .. సురేఖ గభిక్కున లేచింది కళ్లు తుడిచేసుకుంది. పద్మావతి యిలా అర్థరహితంగా పెళ్లిపందిరి నుంచి వెళ్లిపోడం ఎంత అపవాదో గ్రహించినట్లు గబగబ యివతలికి వచ్చింది.

అటూ యిటూ సాధ్యమైనంత వరకూ గాభరా అగుపించనివ్వకుండా చూసింది

"ఏమిటే సురేఖా ! వెతుకుతున్నావు ?" ఒకావిడ అడిగింది.

"అబ్బే ! . . ఏమీ లేదండీ ! దొడ్డమ్మ కోసరం" సురేఖ సంభ్రమంగా అక్కణ్నుంచి వెళ్లిపోయింది.

"సీతో ఉన్నావిడేగా అక్కా ?" ఒక పదేళ్ల పాప జరిగిన ఉదంతమంతా ప్రత్యక్షంగా చూసినట్లు—సురేఖ ఎవరికోసరం వెతుకుతున్నదో తెలిసినట్లు అడిగింది.

సురేఖ ఆశగా ముందుకు వొంగి "ఆఁ! ఏటు వెళ్లిందో చూశావా ?" అన్నది

40 వ పేజీ చూడండి

# ప్రధానం



నాకు జ్ఞాపకం ఉన్నప్పటినుంచీ ప్రేమించుకుంటూనే ఉన్నాము! నేల దున్నేకాలం వచ్చింది, విత్తులు నాటే సమయం ఇదే కోతలు కోసే వేళ కూడా వచ్చింది గోపురాల లాగ పైకి లేచే కప్పులు కల ఇళ్ల స్తంభాల కింద నూక గాలికి చెల్లాచెదరయిపోతోంది నిర్మానుష్యమయిన పొలాలలో గాలి హోరులో మీపేరు ప్రతిధ్వనిస్తున్నట్లు వినిస్తుంది ఎక్కడో ఏదో కంఠస్వరం అశ్రుతం అయినట్లుగా చిన్న చర్చిముందు ఒక బయలు ప్రదేశం ఈ బయలు ప్రదేశంలో చిన్న వయస్సు వారంతా గుమిగూడారు దిమ్మెసతో నేల మట్టంచేసి దుబ్బుని పీకేస్తున్నారు, ఒక గదిలో ఒక అబ్బాయి, ఊగే కుర్చీమీద గోడకి తగిలించి ఉన్న గీటార్ (వాద్యం) తీసి వాయించడం మొదలుపెట్టాడు, నృత్యం చెయ్యాలి కదా! అమ్మాయిలు ఉడకబెట్టిన అరటికాయలని దంచుతున్నారు, ప్రత్యేకమయిన మిఠాయి వస్తువు తయారు చెయ్యటానికని. చాలా విశాలమయిన పావడలు వేసుకొని, తలలో పువ్వులు పెట్టుకున్నారు నీతోనే నృత్యం చేయటానికని నా కళ్లు దించేసుకుని నీ కాలికి తొడుక్కున్న బూట్లనే పరీక్షగా చూస్తూ ఉండిపోతాను.

నాకు పదహారు సంవత్సరాలు వచ్చేవరకూ కాచుకుని ఉండటం నీకు విసుగనిపించింది మా అక్కచెల్లెళ్లు బుట్టలు అల్లుతూ ఉంటే సహాయపడే మిషమీద మా ఇంటికి వచ్చిపోతూ ఉన్నావు ఎప్పటినుంచో! మా బడిపంతులు నాన్న మనకి పెళ్లిచేసుకునే వయస్సు రాలేదంటాడు ప్రేమించటానికి మరీ చిన్నవారం అంటాడు కాని నేను బట్టలు ఉతకటానికని కనుమ ద్వారా నడిచి వెళ్లినప్పుడు దారి కాసి ఏదో చెబుతానన్నావు అక్కడ చీకటిగా ఉంటుంది, పైన పెద్ద 'పండానస్' ఆకుల దట్టమైన నీడకి చీకటి ఆవరించినట్లు ఉంటుంది నా తలమీద బాల్చీ పడిపోకుండా పట్టుకుంటూనే నన్ను వేడిగా ముద్దు పెట్టుకున్నావు బాల్చీని గట్టిగా పట్టుకుని, దాని నీడ మొహంమీద పడుతూఉంటే నా కళ్లల్లోకి లోతుగా చూస్తూ పున్నమినాటికి మీవాళ్లు నా పాణిగ్రహణం కోసం వచ్చి సంప్రదిస్తారని చెప్పావు

ఏడు రోజులు గడుస్తాయి పున్నమినాటి ఉదయం మీవాళ్లు రాత్రికి వచ్చి పెళ్లి ప్రస్తావన చేస్తారన్న సంగతి తలుచుకుని ఉక్కిరిబిక్కిరయిపోయి నా వేలు కొరికేసుకున్నాను స్వయంగా మా నాన్నకి చెప్పటం అంటే నాకు భయం. మా అమ్మ, అక్కయ్యలు కొంత విషయం పసిగట్టి, అలాగా అన్నట్లు భుజాలు కదిపి, చూరుమీద సాలెగూళ్లు దులిపి, ఎముకల గూడులాగ మెరిసేటంత వరకూ బెంచిలని కడిగి శుభ్రం చేస్తారు మేము ఇంటిపని బాగా చేసుకోగలమని మీ కుటుంబం వాళ్లకి తెలియాలి కదా! మీ కుటుంబం ఈ రాత్రి మా యింటికి వస్తోందని పూళ్లోవాళ్లందరికీ తెలిసిపోయింది! ఎందుకంటే, మీ అమ్మ బజారుకి వెళ్లి ఒక పెద్ద కోడి కొనటం చూశారు నా మెడమీది ఎముకల మధ్య సొట్టలో పుట్టుమచ్చ తడుముకుంటాను—ఈ పుట్టుమచ్చ ఉన్నవారికి భర్త మీద విశ్వాసం చాలా ఎక్కువగా ఉంటుందట మెల్లిగా దగ్గినా మానాన్న నావంక చూడడు

అప్పుడే ఉదయిస్తున్న చంద్రుడు కొబ్బరి ఆకుల వెనుక కనిపిస్తాడు మీ కుటుంబం అంతా వీధిమీద నడిచివస్తూ ఉండటం చూసి చెమటలు పోస్తాయి నాకు ముందు మీ తల్లిదండ్రులూ, మిస్టర్ మార్టిన్ నడుస్తున్నారు మిస్టర్ మార్టిన్ మీ తరఫున మాట్లాడే పెద్దమనిషి కాబట్టి ఆడంబరంగా తన 'బరాంగ్ టాగలాగ్' వేసుకుని వచ్చాడు మిస్టర్ మార్టిన్ మూనాగ్న పాఠాలు నేర్పే బడికి ప్రిన్సిపాల్ కాబట్టి ఆయనమాట అంటే మా

# సుప్రసిద్ధ ఆసియా కథలలో మొదటి కథ
# ఫిలిపిన్స్ రచయిత్రి గిల్డా కార్డెరో ఫెర్నాండో రచన.

నాన్నకి మంచి గౌరవం ఉండిఉండాలి వీరి వెనుక ముగ్గురు లావుపాటి ఆడవారు. వారి తలలమీద ఉన్న బరువైన బుట్టలు చూస్తే మెడలు విరిగి పోవేమో అనిపిస్తుంది! నీ సంగతి సరేసరి ఇంట్లోనే వదిలి వచ్చారు మనిద్దరం ఇక్కడ కనిపించుకో కూడదుగా! అందరూ మెట్లు ఎక్కుతారు, మీ అమ్మ, మీ నాన్న, స్కూలు ప్రిన్సిపాలుగారు, బుట్టలు పట్టుకుని వస్తున్న ముగ్గురు ఆడవారూ, నేను వడక గదిలోకి పారిపోయి దోమతెర కింద దాక్కుంటాను

మా అమ్మ, నాన్నతో అందరూ అర్ధచంద్రా కారంలో కూర్చున్నారు ముగ్గురు ఆడవారూ భోజనంచేసే బల్లమీద అధికారం స్వీకరించారు వంటగది వారి అధీనం అయింది బుట్టలు ఖాళీ చేసి వాటిలోవి బల్లమీద అమర్చటం మొదలు పెడుతున్నారు ఒక పెద్ద పళ్లెంమీద పూర్తిగా ఉడకబెట్టిన కోడిపెట్ట, ముక్కు, కాలిగోళ్లు అలాగే ఉన్నాయి దీనికింద ఆకుకూర మధ్య ఉడకబెట్టిన కోడిగుడ్లు, పొదుగుతోందా అనిపిస్తుంది పెట్ట నోటిలో మరొక చిన్న గుడ్డుని చూసి మా చెల్లెళ్లు ఆశ్చర్యపడిపోయారు 'ప్రధానం—కోడి'ని చూడటం వారికి ఇదే మొదటిసారి

రెండో బుట్టలోంచి, పంది మాంసంతో వండిన సేమియా, తీపి, కారం, పులుసువేసిన చేపలు, మొక్క వేసిన చిక్కుడు గింజల గారెలు, గొడ్డుమాంసంతో చేసిన బంగాళదుంప 'స్టూ'

మూడవ బుట్ట నిండా పళ్లేలూ, చంచాలూ, ఫోర్కులూ, కత్తులూ, గ్లాసులూ, సాసర్లు మాత్రమే ఉంటాయి మీ కుటుంబం ఈ రాత్రికి మాతోనే భోజనం చేస్తారు అమ్మాయివైపు వారిని ఇబ్బంది పెట్టడం మంచిదికాదని కావల సింది అంతా తామే తీసుకువచ్చేశారు తుడవ టానికి గుడ్డపేలిక కూడా వారిదే! తాము రాక ముందు ఇల్లు ఎంత శుభ్రంగా ఉందో అలానే వదలి వెళ్లాలి వారు

వాళ్లెందుకు వచ్చారో మా నాన్నకి తెలుసు వ్యవహారం బాగా సాగటంలేదు పిల్లల ఇష్టం లేనిదే ఈ ఇరవైయవ శతాబ్దంలో తల్లిదండ్రులు పెళ్లి నిశ్చయించటం తప్పుకదా అంటాడు మా పందొమ్మిదవ శతాబ్దం నాన్న నిజం కనుక్కుంటా నంటూ, నా గదిలోకి వస్తాడు. తెల్లటి దోమతెర బోను వెనుక దాక్కున్న నన్ను సమీపిస్తాడు నువ్వే పెళ్లిసంబంధాలు మాట్లాడేసుకుంటున్నావా అని అడుగుతాడు నేను మాట్లాడను ఎంత గదమాయించినా మా నాన్న అంటే నాకు చాలా ఇష్టం చదువు మానేసి పెళ్లి చేసుకుంటున్నానని ఆయన కొంచెం బాధపడుతున్నాడని నాకు తెలుసు చిన్నపిల్లల మూకతో నిండిన ఇంట్లో వంట చేస్తూ, చాకిరీ చేస్తూ నా యవ్వనం అంతా వృధాచేసుకొనటం ఆయనకి ఇష్టంలేదు అయితే నువ్వంటే నా కెంత ప్రేమో ఆయనకి తెలీదు. మన పిల్లలతో నిండిన ఇంట్లో చాకిరీ చేస్తూ నా యవ్వనం అంతా గడిపెయ్యటం నాకు ఎంత ఇష్టమో ఆయనకి తెలీదు మనం ప్రేమికులమా అని అడుగుతాడు నేను జవాబు చెప్పకపోతే హఠాత్తుగా తిరి గివెళ్లిపోతాడు

నేను సమాధానం చెప్పకపోవడంతో మానాన్న మిస్టర్ మార్టిన్‌తో చెప్తాడు మన ఇద్దరిమధ్యా ఒప్పందం లేనప్పుడు, ఈ ఇరవైయవ శతాబ్దంలో కుటుంబాల మధ్య ఒప్పందం ఏమిటి అంటారు

> రాజకీయ వార్తల విషయం లోనే కాక సాహిత్యం విష యంలో కూడా మన పత్రికలు ఆసియా దేశాలను అశ్రద్ధ చేస్తున్నాయనే ఆరోపణ లేక పోలేదు! పాశ్చాత్య సాహిత్యం తెలిసినంతగా మనకి మన ఖండం లోనే వెలువడిన, వెలువడు తున్న సాహిత్యం గురించి తెలి యదు. ఈ లోటును కొంతవరకు తీర్చేందుకే సుప్రసిద్ధ ఆసియా రచయితల కథలు కొన్ని వరు సగా ప్రచురించదలిచాము మొదటి కథ ఫిలిపీన్స్‌కి చెంది నది. ఒక్కొక్క వారం ఒక్కొక్క దేశానికి సంబం ధించిన కథ ప్రచురిస్తాము...

కాని ప్రిన్సిపాల్‌గారు అంతటితో వదలడు వచ్చే పున్నమినాడు మళ్లీ వస్తానంటాడు.

పై పున్నమినాడు కూడా మీవారికి నిరాశే ఎదురవుతుంది, కాని తను ఎక్కువ కాలం ఆగ లేడని మానాన్నకి తెలుసు నాకు పదహారు ఏళ్లు వచ్చి ఎదిగిన స్త్రీని అయిపోయాను, మూడవ మాటు వస్తున్నామని మీవాళ్లు కబురు పంపించ డంతో, ఏదో ఒక సమాధానం ఇవ్వాలని గ్రహించ గలుగుతాడు వివాహం నిశ్చయం అయినా సంవ త్సరందాకా జరపరాదని మా అమ్మతో మాట్లాడి నిర్ణయిస్తారు. ఇది మా ప్రాంతం అలవాటు కూడా. కొన్ని కష్టమయిన పనులు ఇప్పించి నీ ప్రేమకి పరీక్ష పెట్టాలని అనుకుంటాడు

ఆ పున్నమిరోజు రానే వస్తుంది మీ అమ్మా, నాన్నా, ముగ్గురు ఆడవాళ్లూ, ప్రిన్సిపాల్‌గారూ బుట్టలతో దిగుతారు మా నాన్న నీ 'బానిసత్వం' షరతులు వివరిస్తాడు ఒక సంవత్సరం దాకా నువ్వు మా ఇంటికి నీరు పట్టుకు రావాలిట ప్రతి రోజూ, బావి దగ్గరికి అయిదు తడవలు వెళ్లి రావాలిట ఒక సంవత్సరంపాటు మా బుట్టలు అల్లటానికి కావలసిన 'పాండానస్' చెట్టు ఆకులు, చీల్చి, ఎండబెట్టి తీసుకురావాలిట సోమవారాలు—అంటే సంత రోజులు—మా ఇంటికి మధ్యాహ్నం భోజనాలు వండి పంపించాలి మా పొలం కంచె మీరే వెయ్యాలి మా స్నానాలగది మీద వెదురు పోతోంది కాబట్టి ఆ గదిని బాగుచేయించాలి. విత్తనాలు నాటే సమయం వచ్చినప్పుడు వచ్చి సహాయపడాలి ఏడాది పూర్తి అయిన తర్వాత ముహూర్తం పెడతారు

పైన రాబోయే నెలలు ఇంకా విచారకరంగా ఉంటాయి—మన ఇద్దరినీ ఒక క్షణం కూడా వంటరిగా ఉండనివ్వరు ఈ పనులన్నీ మరీ కష్ట ముగా ఉన్నాయని మనిద్దరం కలిసి ఎక్కడ లేచిపోతామో అని వారి భయం ఒకరోజు మా అమ్మ నీకు 'విషమ పరీక్ష' కూడా పెడుతుంది మా భోజనానికి వాడే 'బంకమట్టి చేప' ని నువ్వే శుభ్రం చెయ్యాలి, అంటుంది ఈ పరీక్షలో తప్పిన కాబోయే అల్లుళ్లు ఎంతమంది! ఆ బంక మట్టి చేప 'గిర్' లు పదునుగా ఉంటాయి వాటిని సరిగ్గా పీకివెయ్యకపోతే వండటానికి బాగా ఉండదు చేప జిగటగా తయారవుతుంది నువ్వు మాత్రం సంతోషంగా, గిలగిల కొట్టుకుంటున్న చేపని తీసుకుని శుభ్రంగా కడిగివేశావు మా అమ్మ ఆనందానికి గుర్తుగా ఒక చిరునవ్వు నవ్వుతుంది నా గుండె సంతోషంతో గంతులు వేస్తుంది—బంక మట్టి చేపని శుభ్రం చెయ్యగలిగినవాడికి తక్కినవి లెక్కేమిటి ?

పొలాలు దున్నే కాలం వచ్చింది కోతలు త్వరలోనే ప్రారంభం అవుతాయి పని ఎక్కువయి నువ్వు చిక్కిపోయావు బాగా మారిపోయావు అయినా మనం మాట్లాడుకునేందుకు అవకాశమే లేదు నిరుపట్టి మా వంటగదికి తీసుకుపోయేప్పుడు నీ వాలకం దారుణంగా ఉన్నట్లే కనిపిస్తుంది నేల కడిగేప్పుడు నీ మొహంమీది చిరునవ్వు మాయం అవుతుంది ఒకరోజు పొద్దున, మన పెళ్లి నిశ్చయం అయిన రోజున ఆరునెలలో మా అక్కతో బజారుకి వెళ్లినప్పుడు ఒక స్నేహితు రాలు కనిపించి వాళ్లింటికి రమ్మంటుంది ఏదో చూపిస్తుందిట! ఇల్లు దగ్గిరే, మేయర్ ఇంటి పక్కన. మా అక్క సరే అంటుంది. కాని,

45 వ పేజీ చూడండి

### గ్రహస్థితి

మిధునంలో రాహువు, కన్యలో బుధుడు, కన్య తులలో సూర్యుడు, తులలో శుక్రుడు, తులా వృశ్చికాలలో అంగారకుడు, ధనస్సులో కేతువు, మకరంలో శని, మీనంలో గురువు, కర్కాటక సింహ కన్య తులలో చంద్రుడు.




దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**11-10-1963 శుక్రవారము మొదలు 17-10-1963 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

మీ ఓర్పును పరీక్షించే పరిస్థితులు ఏర్పడుతవి స్నేహితులు ఒక్కొక్క రూపంలో భారం మోపుతూ ఉంటారు. ఇంతకు ముందు ముగింపుకు రాని వ్యవహారాలు అనుకూల స్థితికి వస్తవి సంఘ కార్యాలలో ఏర్పడిన అభిప్రాయ భేదాలు సమంజసంగా పరిష్కారం అవుతవి వృత్తి ఉద్యోగాలలో శత్రువులు ఉంటారు ప్రయత్నాలలో ఎన్ని మెలికలు కనుపించినా పర్యవసానం బాగుంటుంది ముందు జరుగవలసిన పనులకోసం కొరకు ధనవ్యయం చేస్తారు కుటుంబంలో సంతోష దాయకమైన సమయం పై మెరుగులు చూచి పొరపాటు పడే అవకాశాలున్నావి దైవ కార్యాలు నెరవేరుతవి 11, 12 తేదీలలో మంచి స్నేహము, సంతోష వార్తలు

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా, రోహిణి, మృగశిర 1, 2 పా.)**

ఈ సమయంలో సూక్ష్మగ్రహణ శక్తి కలిగి ఉంటారు. ప్రత్యక్షంగా అపకారం జరుగునట్లు కనుపించినా చల్లగా తప్పించుకొన గలుగుతారు. ఖర్చులు పెరుగుతవి. అయితే ధన సంబంధమైన ఇబ్బంది మాత్రం ఉండదు. మానసికంగా విశ్రాంతి లేని సమయం. వ్యవహారరంగంలో మీ అశ్రద్ధవల్ల "గోటితో గిల్లతగిన దానిని గొడ్డలితో నరికినట్లు"గా శ్రమ పడవలసి వస్తుంది కుటుంబ విషయాలలో పట్టుదలలు, స్పర్థలు వీటికి అవకాశం లేకుండా చూచుకొనండి ఉష్ణాధిక్యతవల్ల అసౌఖ్యం కనుపిస్తుంది. వృత్తిలో క్రొత్త ప్రయత్నాలు కలిసి వస్తవి. లాభవార్తలు తెలుస్తవి. ఇతరులకు సహాయం చేసే అవకాశం కలుగక పోవచ్చు. గౌరవం లభిస్తుంది. 12, 13 తేదీలలో అధికారులవలన లాభం, భారీ కార్యక్రమాలు.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా, ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ప్రస్తుతం గ్రహబలం బాగుంది శత్రువులు తొలగుతారు వృత్తి వ్యాపారాలలో నిరాటంకంగా ముందుకు పోగలుగుతారు సంఘ కార్యాలు శ్రమతో కూడి ఉంటవి కుటుంబంలో సంతోషంగా ఉంటుంది ధనాదాయం పెరుగ తగిన సమయం పాత స్నేహితులను కలుసుకొంటారు ఒక సమయంలో ఇతరుల సహాయం కోరవలసి వస్తుంది విద్యా సంబంధమైన చర్చలు, విమర్శలు మొదలయిన వాటిలో పాల్గొంటారు ఇంతకు ముందు కలిగిన భయాందోళనలు తొలగిపోతవి వారం రెండవ భాగంలో శక్తికి మించిన పనులు పైన పడుతవి జయం లభిస్తుంది ప్రస్తుతం మీకు కావలసిన పద్ధతిలో అన్ని సౌకర్యాలు లభిస్తవి మీరు చేసే పనులను తిరిగి పరిచూచుకొనటం అవసరం. 13, 14 తేదీలలో ధనలాభం, వివాదాలు

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా, పుష్యమి, ఆశ్లేష.)**

సంతోషము, సుఖము పొందగలుగుతారు ఇతరులను తృప్తి పరచే ప్రయత్నాలు పూర్తిగా ఫలించవు వ్యాపార వ్యవహారాలలో మీ మాట గెలుస్తుంది బంధుమిత్రులవద్ద నుంచి ఎదురు చూస్తున్న వార్తలు సకాలంలో అందుతవి అధికారుల వలన కావలసిన పనులలో ఆటంకాలు కనుపిస్తవి ఈ సమయంలో మిమ్ములను వినియోగించుకొన్నంత సులభంగా మీకు ఉపయోగించే వారు ఉండరు విలువ గల వస్తువుల మీద ధనం వినియోగిస్తారు మీ క్రింద పనిచేయువారితో అభిప్రాయ భేదాలు పడుతున్నా కార్యక్రమాలు సాగిస్తూనే ఉంటారు ప్రయాణాలు లాభసాటిగా కనుపించవు 14, 15 తేదీలలో విరుత్సాహం, వస్తునష్టము.

* * *

### ఈ వారము ధరలు

వేరుశనగ పప్పుకు కొద్ది గిరాకివస్తుంది నూనెధర సాధారణంగా ఉంటుంది నూలు ధర మందీ అవుతుంది ప్రత్తి ధరలో పెద్ద మార్పు ఉండదు కందుల ధరలో తేజీ సూచనలున్నవి. మిర్చి ధర ముందు పెరిగి వారాంతంలో తగ్గుతుంది

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

క్రొత్తక్రొత్త యోచనలు బయలు దేరుతవి. ఆర్థిక సమస్యలు క్రమంగా తగ్గుతవి ఇంతకు ముందున్నటువంటి అపవాదుల తొలగిపోతవి. వృత్తిలో శ్రమను భరించవలసి వస్తుంది. గౌరవం బాగుంటుంది ఇంతకు ముందున్న ఆందోళన తగ్గిపోయి ప్రశాంతంగా ఉంటారు. దుర్వార్తలు తెలియగలవు ప్రస్తుతం ధనయోగంతో పాటు ఆడంబరం కూడా పెరిగే సమయం. మీ మాటలను అనుసరిస్తున్నట్లు ఉన్నవారి నందరినీ నమ్మవద్దు సంఘంలో కృషి ఫలిస్తుంది. పిల్లల వలన సంతోషదాయకంగా ఉంటుంది. మంచి చెడ్డలు ఆలోచించకుండా ఇతరుల మాటను బలపరచటం వంటి పనులకు పోవద్దు 15, 16 తేదీలలో దండుగ ఖర్చులు. కష్టవార్తలు

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా, హస్త, చిత్త 1, 2 పా)**

ఆర్థిక స్థితిగతులలో పెద్ద మార్పులు ఏర్పడవు కాని, సంతోషము, గౌరవము బాగుంటవి లోగడ మీతో సంబంధంలేని వారే ఈ సమయంలో ఉపయోగిస్తారు శుభ కార్య ప్రయత్నాలు సుభంగా జరుగుతవి. మీ మాటలలో ఎదటివారికి సందేహాలు ఏర్పడగల అవకాశాలున్నవి ప్రయాణం చేస్తారు కుటుంబంలో పరస్పరం భేదాభిప్రాయాలు వస్తు ఉంటవి అధికారులతో మంచితనం నిలుపుకొనటం అవసరం. ఒక పని నిమిత్తం చేసిన ప్రయత్నం మరియొక సందర్భంలో వినియోగించుకొనవలసి వస్తుంది ఏ విషయంలోనైనా మీ మనస్సు దృఢంగా ఉంటుంది విద్యా సంబంధమైన కృషిలో ప్రోత్సాహం బాగుంటుంది 16, 17 తేదీలలో చిక్కులను తొలగించుకొనుట, ఆదాయవృద్ధి

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

సమయం మంచిది సాటివారిలో మంచి పేరు వస్తుంది కుటుంబంలో సుఖ సంతోషాలు బాగుంటవి. అయితే ఎప్పటికప్పుడు ధనలోపం

కనిపిస్తూ ఉంటుంది. ఆరోగ్యం కూడా సంతృప్తిగా తోచదు ఇండ్లు, వాహనాలు మొదలయినవి కొనగలుగుతారు మీయందు విశ్వాసం చూపవలసిన వారు చల్లగా ఎదురు తిరుగుతారు వినోద కార్యక్రమాలలో పాల్గొంటారు దూర మందున్న వారి వద్దనుంచి సంతోష వార్తలు తెలుస్తవి అకస్మాత్తుగా పడటం, గాయము మొదలయిన వాటివల్ల బాధకలిగే అవకాశాలున్నవి బాహ్య గౌరవం బాగుంటవి మీ మాటలలో తప్పులు వెతికి కలహించేవారుంటారు 16, 17 తేదీలలో పట్టుదలతో కార్యసిద్ధి, శ్రమ, ఆదాయభంగము

* * *

**వృశ్చికం:**

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)**

ఈ సమయంలో ప్రతి చిన్న విషయం జ్ఞాపక ముంచుకొనటం అవసరం అయినవారితో మాట కలవదు వ్యవహార రంగంలో క్రమ పద్ధతి కనుపించదు "కొండ త్రవ్వి ఎలుకను పట్టినట్లు"గా ఉంటుంది ప్రయాణ సూచన లున్నవి పెద్ద మొత్తాలలో ఆదాయ వ్యయాలు ఉంటవి శుభ కార్యాలలో పాల్గొంటారు. మాన సికంగా నిరుత్సాహం తోస్తుంది ఉత్తర దిక్కు నుంచి శుభవార్తలు వింటారు వృత్తి ఉద్యోగా లలో తోటివారి సహాయం కొంతవరకు లభి స్తుంది ప్రస్తుతం సమయం, సందర్భం కని పెట్టి తూచినట్లుగా మాట్లాడటం అవసరం ధర్మకార్యాలకై ఖర్చులు చేస్తారు మీ బాధ్యత లను ఇతరులమీద విడచి పెట్టవలసిన సమయం 15, 16 తేదీలలో నిరుత్సాహం, శక్తికిమించిన పనులు

* * *

**ధనుస్సు:**

**(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)**

జయప్రదమైన కాలం వృత్తిలో గౌరవము అభివృద్ధి కనుపిస్తవి ఏ పనిలో ప్రవేశించినా పదిమందీ మీ మాటను ఆమో దిస్తారు ఈ వారం ఆరంభంలో అనారోగ్యం చేసి నెమ్మదిస్తుంది మీరు ఏది కోరుకుంటారో అది వెంటనే ఒక రూపంలోకి వస్తుంది అయితే స్వశక్తితోనే నిర్వహించ గలుగుతారు పిల్లల ఆరోగ్యం గురించి జాగ్రత్తగా ఉండండి మిమ్ములను మోసగించి సహాయం పొందచూచే వారుంటారు కొన్ని సమయాలలో నిర్మొహ మాటంగా మాట్లాడవలసిన స్థితి ఏర్పడుతుంది తొందర పడి వాగ్దానాలు చేయవద్దు ప్రస్తుతం దుబారా ఖర్చులు పెరుగుతవి వ్యాపారం వంటి పనులలో పెట్టుబడుల పెట్టవలసిన సమయం 14, 15తేదీలలో గౌరవము కార్యభంగ సూచన మిత్రలాభం

* * *

**మకరం:**

**(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)**

దైవానుగ్రహంవల్ల కాలం అనుకూలిస్తుంది. శక్తి సామర్థ్యాలు పెరుగుతవి. అనుకోకుండా ఆదాయం పెరుగుతుంది లోగడ మీ వలన జరిగిన పొరపాట్లను సర్దుకొన గలుగుతారు కుటుంబంలో క్షేమ లాభాలు బాగుంటవి ఇతరుల మీద వదలిన కార్య క్రమాలలో పొరపాట్లు జరగటం వల్ల మీరు బాధపడవలసి ఉంటుంది పశ్చిమ, ఉత్తర దిశలనుంచి లాభసూచనలున్నవి మీ మాటవల్ల తోటివారికి సహాయం లభిస్తుంది ఉద్యోగ వృత్తులలో పై వారితో ఘర్షణలు సంభ వించగల కాలం అనేక సందర్భాలలో మీ వ్యూహాలు యిదార్థం అవుతవి బంధువులవల్ల మాటరాకుండా చూచుకొనండి 13, 14 తేదీలలో అశాంతితో కూడిన ఆలోచనలు, ఫలిత భంగము

* * *

**కుంభం**

**(ధనిష 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)**

మీ మాటకు, మీ పనికి భంగము అనేది ఉండదు గొప్పవారి స్నేహం, గౌరవ ప్రదమైన కార్యక్రమాలు, ఉత్సాహము బాగుంటవి ఎప్పుడు పదిమందితో ఘనంగా ఉండతగిన సమయం అయిష్టంతోనే క్రొత్తపనులు ఆరంభించటం జరుగుతుంది ఇతరుల పొగడ్తలకు మోసపోవద్దు కుటుంబంలో శుభ, పుణ్యకార్యాలు జరుగుతవి అధికారం బాగుంటుంది వృత్తి ఉద్యోగాలలో మీ ధర్మమును హుందాగా నడుపుకొన గలుగు తారు తప్పకుండా తిరిగి రాగలవనే భావంతో అప్పు ఈయవద్దు వారం చివరలో మీ బాధ్యతలను గురించి సంజాయిషీ చెప్పవలసి రావచ్చు ముందు జాగ్రత్త మంచిది విలువగల వస్తువులు కొనే ప్రయత్నాల వంటివి విరమించవలసి వస్తుంది 12, 13 తేదీలలో దేహబాధ, సంతోష వార్తలు, ధనలాభం

* * *

**మీనం:**

**(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి)**

ఈ వారం ఎవ్వరిని గురించీ ఏమీ అనుకో వలసిన సమయంకాదు మీ జాగ్రత్తలో మీరు ఉండటం మంచిది మధ్యమధ్య ఆరోగ్యం సరిగా ఉండదు స్నేహితుల ప్రసంగాలు పూర్తిగా యదార్థాలని నమ్మకోవద్దు వృత్తిలో ముందు కన్నా మేలుగా ఉంటుంది కాని, అందుకు తగిన సంతృప్తి మాత్రం తోచదు ఆదాయం మామూ లుగా ఉంటుంది మీకు సంబంధంలేని పనులలో ఎంత మాత్రం జోక్యం పెట్టుకోవద్దు. సహ జంగా మీరు నెరవేర్చవలసిన నిత్య కార్యకలాపాలు నిలిచిపోకుండా చూచుకొనండి వారం రెండవ భాగంలో కుటుంబంలో అనారోగ్యాలు కనుపిస్తవి చిన్న పనులకై విశేష ప్రయత్నాలు చేయవలసి ఉంటుంది పుణ్య కార్యాలు జరుగుతవి 11, 12 తేదీలలో సంఘంలో గౌరవం, అధికారుల ఆదరణ ★



# ప్రథమ సాధనము




చర్మ ఆరోగ్యానికి మరియు సౌందర్యానికి సింథాల్ రూఢియైన సాధనము. సింథాల్ యందున్న అద్భుత క్రిమి నిరోధకమైన జి-11* శిశువుయొక్క సున్నితమైన చర్మమును, దానిమీద సామాన్యంగా పెరుగుచుండే లక్షలకొలదీ క్రిముల బారినుండి కాపాడును...చర్మ పొడలను, ఉక్కపోతను, బట్టరాపిడివల్ల కలిగే చర్మరేగుడును పోగొట్టి నిరోధించును.

మనోల్లాసకరంగా పరిమళ మొనర్చబడిన సింథాల్ చాలా సౌమ్యమైనది. శుభ్రపరచుచూ రక్షణనిచ్చును... అది కళ్లకు హానిచేయనిది... శిశువులుగల గృహమందు ఉండవలసినది.




రోగను గలిగించే సబ్బు,
దుర్గంధమును తొలగించును కూడా

[illegible]

సంపూర్ణ రక్షణకోసం. మనోహరమైన సువాసనగల, దుర్గంధమును తొలగించే, శమనకరమైన జి-11తో గూడిన గోద్రెజ్ సింథాల్ టాయిలెట్ పౌడర్ వాడండి.

*"జి-11-ఎమిలి" అనే ఉచిత సలహా పుస్తకము కోసం గోద్రెజ్, బొంబాయి-12కు వ్రాయండి.

* ఎల్ ఇవోన్ కంపెనీ యొక్క ట్రేడ్ మార్కు.

Godrej గోద్రెజ్ సబ్బులలో ఉత్తమ నామము



# కొలంబా

## రచన: ప్రాస్పర్ మెరిమె

### జరిగిన కథ

కర్నల్ థామస్‌నెవిల్, తన కుమార్తె లిడియాతో ఇటలీ యాత్రానంతరం ఫ్రాన్స్‌వస్తాడు లిడియా సాహసం గల యువతి చిత్రలేఖనం తెలుసు 'కార్సికా' ఫ్రాన్సు ఇటలీల దరిని గల ద్వీపం అక్కడికి వెళ్లడం కష్టనష్టాలతో కూడిన పని ఐనా లిడియా, నెవిల్‌లు నావ కాప్టెన్ మాటతో ప్రయాణం అవుతారు కార్సికాకు బయలుదేరారు వారితో లెఫ్టినెంట్ "ఆర్సొద్దెల్లా రెబ్బియా" అనే కార్సికను కూడా వచ్చాడు. కర్నల్‌కి రానురాను రెబ్బియాతో పరిచయం పెరుగుతుంది మూడు రోజుల ప్రయాణం తర్వాత వారి నౌక అజాచ్చియో గల్ఫ్ సమీపించింది వారు కార్సికా చేరారు పాస్‌పోర్టు ఆఫీసరు మాటలవల్ల, ఆర్సో తండ్రి హత్యకు లోనయ్యాడని మిస్ లిడియా గ్రహిస్తుంది ఇంతలో ఆర్సో చెల్లెలు కొలంబా అతన్ని వెతుక్కుంటూ అజాచ్చియోకి వస్తుంది కర్నల్‌గారి సత్రంలోనే దిగుతుంది కొలంబా, ఆర్సో ఆంటన్‌లు పియత్రనెరాకి వెళ్ళిపోతారు స్వగ్రామంలో కొలంబా బ్రాందొలాచ్చియో అనే బందిపోటు దొంగకు సహాయం చేస్తున్నట్లు ఆర్సో ఆంటన్ తెలుసుకుంటాడు అతన్నీ అతని సహచరుడినీ కూడా కలుసుకుంటాడు. పొరుగింటి బాప్తిస్ట పియత్రి చనిపోగా పరామర్శకు వెళ్లిన కొలంబా, ఆర్సో ఆంటన్‌లు, తన విరోధి బారిచీనిని కలుసుకుంటారు. గ్రామాధికారి ఆర్సోకి విరోధాలు మానుకోమని సలహాఇస్తాడు మిస్‌నెవిల్ ఆర్సోకి ఉత్తరం వ్రాస్తుంది కొలంబా విరోధం మానుకోవద్దని చెబుతుంది

## 15

పొద్దున ఆరు గంటలవుతున్నదనగా గ్రామాధికారి పనిమనిషి వచ్చి ఆర్సో ఇంటి తలుపు తట్టాడు. తలుపు తీసిన కొలంబాతో, గ్రామాధికారి ఆమె అన్నని చూడటానికి ఇష్టపడుతున్నాడని చెప్పాడు. కొలంబా, తడుముకోకుండా, తన అన్న మెట్లమీద జారి పడ్డాడనీ, కాలు బెణికిందనీ వచ్చి చూసేందుకు వీలుకాదు కనుక గ్రామాధికారినే కావలిసినట్లయితే అక్కడికి రమ్మని చెప్పవలసిందనీ, అంది. ఇది జరిగిన కొంతసేపటికి ఆర్సోనే దిగివచ్చి గ్రామాధికారి కబురు ఏదయినా పంపాడా అని అడిగాడు. 'ఇక్కడే కాచుకుని ఉండమన్నాడు,' అంది కొలంబా ధీమాతో. పావుగంట గడిచింది; బారిచిని ఇంటివైపు నుంచి ఏ సంచలనమూ కనిపించ లేదు; ఇంతలో ఆర్సో కొలంబాని అడిగాడు 'కొత్తసంగతులు ఏవయినా తెలిశాయా,' అని. గ్రామాధికారి ముందు అన్నీ చెబుతానని సమాధానం ఇచ్చింది కొలంబా. ఆమె ధోరణి చాలా ప్రశాంతంగా కనిపించింది. కాని, ఆమె కళ్లలో మాత్రం ఏదో ఆందోళన ఉన్నట్లు తెలుస్తోంది.

చివరికి, బారిచినీ ఇంటి తలుపు తెరచుకుంది, ప్రయాణానికి కావలసిన దుస్తులు వేసుకున్న గ్రామాధికారి ముందు బయటికి వచ్చాడు అతని వెంటనే, మేయర్‌గారూ, అతని కొడుకులు ఇద్దరూ వచ్చారు తెల్లవారగానే ఇంత ముఖ్యమయిన న్యాయాధికార పదవిని ఆక్రమిస్తున్న వ్యక్తి ముగ్గురు బారిచినీలతో దెల్లా రెబ్బియా ఇంటికి బయలుదేరి వెడుతున్నాడని తెలిసిన పియత్రనెరా వాసుల ఆశ్చర్యానికి అంతులేదు 'రాజీ చేసుకుంటున్నా'రని అరిచారు కొందరు పెత్తనాలు చేసే పెద్ద మనుష్యులు

"చెబుతున్నా వినండి!" అన్నాడు ఒక ముసలివాడు "ఆర్సో ఆంటోనియో యూరప్‌లో ఉండి చాలా మారిపోయాడు!"

"ఈ బారిచినీలు మన్నింపు కోరటానికి వెడుతున్నారు," అన్నాడు ఒక రెబ్బియాపక్షం వ్యక్తి

"ఇదంతా గ్రామాధికారి గారి వేడుకోవడం వల్ల జరిగిందే," అన్నాడు ముసలివాడు

"ఈ రోజుల్లో ధైర్యం ఎవడికుంది? ఇప్పటి కాలం అబ్బాయిలు తమ తండ్రి రక్తం మీద ఏమాత్రం గౌరవం చూపరు! కొడుకులా కాదా అనేట్లుంటారు!"

ఆర్సో నడక మామూలుగానే ఉండటం చూసి గ్రామాధికారి ఆశ్చర్యపడకపోలేదు. కొలంబా వెంటనే క్షమించమని అడిగింది "మీకేమయినా ఇబ్బంది కలిగితే మా అన్నయ్య మన్నించమని అడుగుతాడు," అంది

ఆర్సో కూడా ఈ చిన్న మోసం జరిగినట్లు తనకి తెలియదనీ, చాలా బాధపడుతున్నాననీ చెప్పాడు గ్రామాధికారితో బాటు పెద్ద బారిచినీ అతని మాట నమ్మినట్లే కనిపించింది, కాని మేయర్‌గారి కొడుకులు మాత్రం అసంతృప్తి ప్రకటించారు "మనల్ని చులకన చేస్తున్నాడు" అన్నాడు ఆర్లాండుచ్చియో అందరికీ వినిపించేలాగ

"మా చెల్లెలే ఇంతపని చేస్తే నా!" అన్నాడు విన్చెంటిల్లో

ఈ మాటలు, అవి ఉచ్చరించటానికి వాడిన కంఠస్వరం, ఆర్సో సౌమ్యవైఖరి కొంచెం తగ్గేట్లు చేశాయి. చిన్న బారిచినీలవైపు అసహ్యంగా చూశాడు.

అందరూ కూర్చున్నారు. కొలంబా తప్ప. ఆమె వంటగదికి పోయే తలుపు దగ్గరగా నుంచుంది. గ్రామాధికారి మాట్లాడటం మొదలు పెట్టాడు. ఆ దేశంలో వింత ఆచారాల విషయం [illegible] పెద్దపెద్ద వైరాలలో చాలా మట్టుకు నిష్కారణగా, చెప్పుడు మాటలవల్ల ప్రారంభం అయినవే అన్నాడు. మేయర్‌వైపు తిరిగి, దెల్లారెబ్బియాగారు ఎప్పుడూ తన తండ్రి మరణానికి బారిచినీ వంశంవారు కారకులని నమ్మ లేదన్న సంగతి తనకి తెలుసునన్నాడు. ఈ రెండు వంశాలవారి మధ్య జరిగిన తగాదాల విషయమయి తనకి ఎప్పుడూ కొన్ని సందేహాలు ఉండనే ఉన్నాయని చెప్పాడు. ఆర్సో చాలా కాలం స్వంత వూరిలో లేకపోవడంవల్ల ఈ సందేహాలు నివృత్తి కాలేదన్నాడు. అంతకు ముందే తెలిసిన కొన్ని విషయాలవల్ల తనకి అంతా స్పష్టంగా తెలియటం చేత ప్రస్తుతం తను వారి కుటుంబాల మధ్య మైత్రి కోసం కృషి చేయటానికి ప్రయత్నించ పోతున్నానన్నాడు.

ఆర్సో మెత్తపడలేదు కాని, కొద్దిగా తల పంకించాడు. బారిచినీ ఎవరికీ అర్థంకాని మాటలు

ఏవో పలికాడు. ఆయన కొడుకులు ఇంటి వాసాలు చూస్తూ ఉండిపోయారు గ్రామాధికారి తన ఉపన్యాసం కొనసాగించాడు ఆర్సేతో బారిచినీ తరఫున ఏదో చెప్పపోతూ ఉండగా కొలంబా తన రుమాలులో నుంచి కొన్ని కాగితాలు బయటికి తీసి మధ్యగా వచ్చి నుంచుంది గంభీరమయిన ధోరణిలో ఇలా అంది

"మా కుటుంబాల మధ్య విరోధం పోతే నాకు సంతోషమే, కాని, నిజమయిన సంధి కుదరాలంటే అన్ని విషయాలూ స్పష్టంగా తెలుసుకోవాలి గ్రామాధికారిగారూ ! తొమాసోబియాంకీ ఎటువంటివాడో తెలిసిన తర్వాత అతని సాక్ష్యం నమ్మటం కష్టంగానే ఉంటుంది— ఇతన్ని జయిలులో అబ్బాయిలు ఇద్దరూ చూశారని చెప్పనా "

"అబద్ధం !" అన్నాడు ఆర్లోండుచ్చియో ఆమె మాటకి అడ్డం వస్తూ "అతన్ని నేనెప్పుడూ చూడలేదు !"

కొలంబా అతని వంక ఏహ్య భావంతో నిండిన చూపు ఒకటి విసిరింది, ప్రశాంతంగా చెప్పుకుంటూ వెళ్లింది

"తన తమ్ముడు థియోడోర్ మూలంగానే తొమాసో బారిచినీని దొంగ సంతకం చేసి ఉత్తరంతో దడిపించాడని మీరు చెప్పారు నిజమేనా ?"

"స్పష్టంగా తెలియటంలేదు ?" అన్నాడు గ్రామాధికారి.

"బియాంకీ లాంటివాడు దేనికయినా తగును !" అన్నాడు ఆర్సే తన చెల్లెలి ప్రశాంత ధోరణిని అపార్థం చేసుకుంటూ.

"దొంగ సంతకం చేసిన ఉత్తరం తేదీ 11 జూలై వేసి ఉంది," అని చెప్పుకుంటూ పోయింది కొలంబా మెరుస్తున్న కళ్లతో "అప్పటికి తొమాసో పిండిమరలోనే తన తమ్ముడితో బాటు పనిచేస్తూ ఉన్నాడా ?"

"ఉన్నాడు" అని జవాబు చెప్పాడు మేయర్ కొంచెం కలవర పాటుగా

"అయితే అప్పటికి తొమాసోబియాంకీ కల్పించుకొనటానికి అనవసరం ఏం వచ్చింది ?" అని అరిచింది కొలంబా విజయగర్వం సూచించే కంఠస్వరంతో "తన తమ్ముడి కౌలు అయిపోయింది కదా ! ఆ కౌలు ఒప్పందం ముగింపు విషయం ఈ రిజిస్టర్‌లో మా తండ్రిగారు రాశారు, ఇదిగో అజాచ్చియోకి కొత్త పిండిమర మనిషిని సూచిస్తూ రాసిన ఉత్తరం కూడా ఉంది నా దగ్గర !"

ఇలా చెప్పి గ్రామాధికారికి తన చేతిలోని కాగితాలు కొన్ని ఇచ్చింది

ఒక క్షణం అందరూ దిగ్భ్రాంతులయ్యారు మేయర్‌గారి మొహం పాలిపోయింది ఆర్సే బొమలు ముడిచి గ్రామాధికారి చేతిలోని కాగితాలు అందుకోబోయాడు

"మమ్మల్ని ఎగతాళి చేస్తున్నారా !" అని అరిచాడు ఆర్లోండుచ్చియో కోపంగా "నాన్నా ఇక్కడ నుంచి వెంటనే వెళ్లిపోదాంరా ! ఇక మళ్లీ రాకూడదు !"

బారిచినీ ఇంతలో కోలుకున్నాడు కాగితాలు తనూ పరీక్షించాలన్నాడు. గ్రామాధికారి మాట్లాడకుండా వాటిని అతనికి అందించాడు. మేయర్ గారు కళ్లజోడు తగిలించుకుని, నిర్లక్ష్యంగా చదివాడు కొలంబా అతనివంక తన గుహని సమీపిస్తున్న లేడివంక ఆడపులి చూసినట్లు చూస్తూ ఉండిపోయింది

"అయితే ." అన్నాడు బారిచినీ కళ్లజోడు తీసి మడిచివేస్తూ, కాగితాలు గ్రామాధికారికి తిరిగి ఇచ్చివేస్తూ, "కర్నల్‌గారి మంచితనం తెలుసుగా తొమాసో అనుకొని ఉంటాడు ఉండాలి తనకి కౌలు తిరిగి ఇప్పిస్తారని మనస్సు మార్చుకున్నాడు కర్నల్ గారని భయపడ్డాడేమో. ఎలాగూ పిండిమరమీద అధికారం చలాయిస్తూనే ఉన్నాడుకదా...."

"నేనే కౌలు పోకుండా ఉంచింది." అంది కొలంబా అవజ్ఞతో కూడిన కంఠస్వరంతో. "మా నాన్నగారు పోయిన తర్వాత వ్యవహారాలన్నీ నేనే చూసుకునేదాన్ని."

"అయితే...." అన్నాడు గ్రామాధికారి "ఈ తొమాసోకి తెలుసు, తను ఉత్తరం రాశానని.... ఇంకా సందేహం ఏమిటి ?.... స్పష్టంగా ఉందిగా !"

"ఈ వ్యవహారం నిండాపెద్ద మోసం ఉందన్నది నాకు స్పష్టంగా ఉంది !" అని అతని మాటకి అడ్డు వచ్చాడు ఆర్సే.

"ఈ పెద్ద మనుష్యులు చెప్పిన దాంట్లో మరొకటి అబద్ధం అంటాను," అంది కొలంబా. అని వంటగది తలుపు తెరిచింది. వెంటనే గదిలోకి బ్రాందొలాచ్చియో, జిజ్ఞాస కలదన్న మనిషి, బ్రుస్కో పేరుకల కుక్కతో లోపలికి వచ్చారు. పైకి చూడటానికి బందిపోటు లిద్దరూ నిరాయుధులుగానే కనిపించారు. తోటాల బెల్టులు ధరించినా పిస్తోళ్లు మాత్రం ఉన్నట్లు లేవు. గది ప్రవేశించగానే మర్యాదగా తమ తలలమీద టోపీలు తీసివేశారు.

వారి ఈ అకస్మిక ప్రత్యక్షం ఫలితం ఏమిటో ఊహించవచ్చు మేయర్‌గారు వెనక్కి జరిగిపోయారు ఆయన కొడుకులు తండ్రిముందుకి వచ్చి బాకులకోసం జేబులలో చేతులు వేశారు. గ్రామాధికారి తలుపువైపు జరిగాడు. ఆర్సే బ్రాందొలాచ్చియోని పట్టుకుని "ఇక్కడేం పని నీకు దౌర్భాగ్యుడా ?" అని అరిచాడు.

"ఇదొక దొంగదాడి మనమీద !" అని మేయర్ కేకవేశాడు తలుపులీసి బయటికి పోవటానికి ప్రయత్నించాడు కాని సవెరియా అవతలవైపు గడియవేసేసింది.

"అయ్యా, పెద్ద మనుష్యులూ !" అన్నాడు బ్రాందొలాచ్చియో "భయపడకండి, నేనేమీ రాక్షసుడిని కాదు. మాకే దురుద్దేశమూ లేదు గ్రామాధికారిగారూ, మీ పాదదాసుడిని— లెఫ్టినెంట్‌గారూ, నన్ను వదలండి, ఊపిరి సలపడం లేదు— ఇక్కడికి సాక్షులుగా వచ్చాం అంతే ఇదుగో 'ఫాదరీ', నీకు మాట్లాడటం బాగా వచ్చు. చెప్పు !"

"గ్రామాధికారిగారూ," అన్నాడు అతను "మీకు నేనెవరో తెలీదు అది నా దురదృష్టం! నా పేరు జియకాంతో కాస్త్రికోనీ ఫాదరీ అని కూడా పిలుస్తారు ఇక్కడ, అమ్మాయిగారు మాత్రం నాకు తెలుసు.... నేనూ తొమాసోబియాంకీ కలిసి ఒకే జయిల్లో మూడువారాలున్నాము— బాస్తియాలో. నేను చెప్పొచ్చేది ఏమిటంటే .."

"నీకా శ్రమ అక్కర్లేదు" అన్నాడు గ్రామాధికారి. "నీలాంటి మనిషి మాటలు వినటం ఏమిటి? దెల్లా రెబ్బియాగారూ, మీకు కూడా ఈ కుట్రలో భాగంలేదని నమ్మటం ఎలా ? లేకపోతే మీ ఇంటికి మీరు అధికారులు కాదా ? ఈ బందిపోటులతో మీ చెల్లెలి సావాసం ఏమిటి ?"

**(ఇంకా ఉంది)**




"మీరు కన్పించడం లేదన్న మీ సంపాదకీయం ఈ చెత్తబుట్టలో వుందండి."



'పెళ్ళికానుక' చిత్రంలో తెనుగు వాళ్ళను దోచుకున్న బి సరోజాదేవి 'దొంగనోట్లు" అనే చిత్రంలో అగుపించనున్నది




### జరిగిన కథ

భర్త రచన రాయమంటాడు తనకు వస్తువు లభ్యం కాదు పైగా సంసార తాపత్రయం కాని గోపాలం అనే కథా నాయకుడు సరోజ అనే కథా నాయిక లభ్యమయ్యారు ఐతే రచన ఎలా. . యింతలో అభిమానులు వస్తారు వాళ్ళు వెళ్ళాక యితర యింటిపనులు కాని కథ రాస్తూనే వుంటుంది ఆమె..

### (గత సంచిక తరువాయి)

'కాఫీ తాగు నాయనా !''—కంఠంలో పాట కువకువలాడింది ఆగి

ఉలిక్కిపడి చూశాడు గోపాలం — ''కాఫీ . తాగే వచ్చానండీ !''

''అదేంమాట ? కాఫీనీళ్ళన్నిసార్లు త్రాగితే ఏమిటి ? తీరా ఇంతదూరం వచ్చి తప్పు ! తాగు నాయనా !''

''పాపం ! మంచిదానిల్లాగే ఉంది మామ్మగారు'' అనిపించిందో క్షణం చప్పగా చల్లారిపోయిన గ్లాసు పెదాల కానించుకోక తప్పలేదు ఉన్నట్టుండి అంది కమల— ''బామ్మగారు . మీతో ఏదో మాట్లాడు తారట, గోపాలరావుగారూ !'' — తుళ్ళిపడ్డాడు గోపాలం నాలుగు చుక్కల కాఫీ టెరిలీన్ షర్టు మీద పడి గాబర్డీన్ పాంటు మీదుగా జారి ... పోయింది.

బామ్మగారు బోసినోటితో అలాగే నవ్వుతూ— 'ఆ నా మొహం ! మాటాడ్డానికేముందీ ? ఏదో మంచీ చెడ్డాను'' అంది.

అన్యాయం ! అధర్మం ! ఈ బాడీతో మాట్లా డ్డానికా తను వచ్చింది ? వీల్లేదు ఈవిడతో తనకేం మంచీ చెడ్డా—వీల్లేద్ ! ఈవిడెవత్తో తన కనవసరం (అనవసరం—గోపాలం కంగారులో . . ) సరో తప్పితే ఎరాయి స్త్రీతో తను మాట్లా డడు—

కమల లేచి నించుంది కలవరపడ్డాడు గోపాలం— ఈబిడా వెళ్ళిపోతుందా ఏమిటి ? తను తెలివిగా కబుర్లలో పెట్టేస్తే సరి? — ''కూర్చోండి కమలగారూ ! మీరు ఠాగోర్ రాసిన . సారీ, ప్రేమ్‌చంద్ రాసిన శ్రీకాంత్ చదివారా ? మీ అభిప్రాయం చెప్తారా ? ప్లీజ్ !'' గర్వంగా చూశాడు

కమల నవ్వింది—''శ్రీకాంత్ రాసింది శరత్తండీ! ఏం? ప్రేమ్‌చంద్ రాసింది మరేదైనా శ్రీకాంత్ మీరు చదివారా ?''

కుచించుకుపోయాడు గోపాలం— ఛ ! ఈ ఆడ పిల్లలకి బొత్తిగా జ్ఞాపకశక్తి ఎక్కువ శరత్ కంటే ప్రేమచందేం తక్కువవాడు ? తను కూడా ఓ శ్రీకాంత్ రాసి పారెయ్యలేకపోయాడా? ఛ !

కమల గోపాలం మొహంలోకి చూసింది— ''ఏమిటీ ఆలోచిస్తున్నారు ?''

''ఎబ్బె ! ఏమీ లేదండీ !''

''అయితే .. మీరు ఒథెల్లో రాసిన షెర్లాక్ హోమ్స్ చదివారా ?'' అంది కమల సీరియస్‌గా ఉన్నా నటనానికి చిహ్నంగా నుదురు చిట్లిస్తూ— కంగారు కంగారుగా ఉన్న గోపాలం రకీమని చెప్పే శాడు — ''చదివానండీ ! ఏమిటో వెధవది .. నా కంత నచ్చలేదు''

''ఏం ?'' క్రింది పెదవి కొరుక్కుంటూ చూసింది కమల

''డైలాగ్సూ అవీ మరీ లెంగ్తీగా ఉన్నాయ్''

''ఎగ్జాక్ట్లీ ! మీకు విజ్ఞానం అపారంగా ఉందండీ !''

''థాంక్స్ ! .. హిహిహి ! ఏమిటో కొంచెం''

''మరి నేను వస్తానండీ ! సరూకి చెప్పే పోతాను. సంగీతం మాష్టారు వస్తారు''

''క .క . కమల గారూ !

విన్పించుకోకుండా లోపలికి వెళ్ళిపోయింది కమల

గోపాలం దించిన తల దించినట్టే ఉంచేశాడు ఎట్టెదురుగా కూర్చున్న బామ్మగారి మిడిగుడ్లూ— వూబ వొళ్ళూ . . చూడాలంటే భయం వేస్తోంది —సరో వచ్చి జుత్తుమీద వేళ్ళు ఆన్చి మృదువుగా నిమిరితే తప్ప ఎత్తలేదు

''అవుతే నాయనా ! . ఇలా చూడూ !''

ఉలిక్కిపడ్డాడు గోపాలం—భయం భయంగా తల తిప్పాడు

''మన దేవూరు నాయనా !''

''తెలీదండీ !''

''మీ వూరయ్యా ! . వూరు తెలీకపోవట ఏమిటి ?''

''వూరాండీ ? ఏవూరండీ ? ఎవరి వూరండీ ?''

''ఇంత అమాయకుడివేలా బ్రతుకుతా వబ్బాయ్ ?'' అంది బామ్మగారు నోటినిండా నవ్వుతూ.

"బ్రతక్కపోతే చస్తాను నీకేం ?" అరుద్దా మనుకున్నాడు

గోపాలం—వూరుకున్నాడు ఎటో చూస్తూ

"ఏం అన్నదమ్ములా—అక్కచెల్లెళ్ళా ఎంత మంది ?"

వాళ్లంతా చాలా బరువుంటారు. ఈవిడేం మోస్తుందా ?

"ఓ అన్నయ్యా ! ఓ అక్కయ్యా ! ! ఓ చెల్లెలూ—ఓ తమ్ముడూ నండీ !"

"బావుంది నువ్వు సరిగ్గా మధ్యవాడి వన్న మాట"

బాహోయ్ ! ఈవిడ జీనియస్‌లా ఉంది.

"మరేం అనుకోకు ! అమ్మా, నాన్నా ఉన్నారా?"

చెప్పడు తను చెప్పడు ఎందుకు చెప్పాలి ? నోటితో చెప్పడం ఇష్టంలేక ఉన్నారన్నట్టుగా తల ఆడించి వూరుకున్నాడు

బామ్మగారు మళ్లా నవ్వింది క్రితంలాగే— "మా సరోజం లాగ నువ్వు వాగుడుకాయివి కానట్టున్నావ్"

చిత్రంగా చూశాడు గోపాలం — బామ్మగారి మొహంలోకి కాస్త ధైర్యంగా చూశాడు గోపాలం —బామ్మగారు సరోకీ తనకీ పోలిక తేవటం ఏమిటి ? మనవరాలితో తనని పోల్చి చూడటం ఏమిటి ?—అర్థంకానట్టు చూశాడు గోపాలం

"మరేవీ అనుకోకూ ! మీకు ఎంతాస్తి ఉంటుం దేమిటీ ?"

ఈవిడేం మాజీ ఇన్‌కంటాక్స్ ఆఫీసరు సతీ మణా ఏమిటి ఖర్మ ?

"ఉంటుందండీ! పదెకరాల పల్లం—ఓ ఏభై ఎకరాల మెట్టా—తోటలూ—దొడ్లూ. .. బావులూ "

"అలాగా? బావుంది అవుతే ఇల్లు ?"

"ఇల్లెందుకు లేదు ? మా నాన్నగారి తాతయ్య కట్టించిన మట్టి డాబా చాలా బావుంటుంది మా తాతయ్యగారు మరమ్మతులు చేయించారు లెండి—మా నాన్నగారు కరెంటు పెట్టిస్తా నంటున్నారు"

"గచ్చు గిలా బావుందీ?"

"ఆ రెండు గిలక బావులున్నాయి లెండి"

"అదికాదయ్యా! నేలకి గచ్చూ అదీ ఉందా అని ? రేపు రాబోయే ఆడదానికి మెత్తటాలూ—అలకటాలూ యాతన కదూ?"

"వీధి చీడీలకీ—చావిడీకీ—మండువాకీ గచ్చే ఉందండీ!"

"పోనీ! రేపు మీ హయాం వస్తేసరి—ఇల్లంతా చేయించుకుంటారు ఈ కాలంవాళ్లు పెళ్లాన్ని కష్టపెడతారా ఏవిటీ?" ఈ ఉపోద్ఘాతం ఏమిటో గోపాలానికేం అంతు పట్టలా కానీ మామ్మగారు మాత్రం మొగుడివల్ల చాలా కష్టాలు పడ్డట్టుంది. పాపం! వెధవకాలం! ఆ రోజుల్లో స్త్రీని పురుషుడు ఉత్త విలాస వస్తువుగా ఉపయోగించు కున్నాడు. మామ్మగారిలాంటి స్త్రీ సోదరీమణు లెందరో. . ఆ ఊబిలో మగ్గిపోయారు—గోపాలం గుండెల్లో సంఘ సేవా భావాలు ఉవ్వెత్తుగాలేచి .. ఉపన్యాస ధోరణిలో ఒయటికి ఉరకటానికి సిద్ధంగా కూర్చున్నాయ్ ! ఆవేశంగా అన్నాడు— "తాత గార్ని మీరు తిరస్కరించి ఉండాల్సింది మీకు మాత్రం వ్యక్తిత్వం లేదూ? మీరు మనుష్యులు కారూ?" బామ్మగారు కళ్లు పెద్దవిచేసి చూసింది—" ఏవిటీ నువ్వు అంటున్నదీ?"

గోపాలం అదే ఆవేశంతో ముందుకుపోయాడు "మీకు అర్థం కాదు బామ్మగారూ! అర్థంకాదు మీ స్త్రీజాతి దాస్య విముక్తికోసం **నా** నులి వెచ్చని యువకరక్తం ఎలా సలసలా మరుగుతోందో మీ కర్థంకాదు"

"ఏవిటయ్యా నువ్వు మాట్లాడేదీ ? నులి వెచ్చని నెత్తురేవిటీ? సలసలా మరగటం ఏమిటీ? అస లేవిటీ సొది ?"

గోపాలం కాస్త తెప్పరిల్లి నాలికతో పెదాలు తడి చేసుకున్నాడు

"అదే బామ్మగారూ! తాతగారు మిమ్మల్ని సరిగ్గా చూడనప్పుడు నానా బాధలూ పెట్టి నప్పుడు "

"ఎవరన్నారా మాట?" హుంకరించింది బామ్మ గారు

ఉలిక్కిపడ్డాడు గోపాలం

"ఎవరు చెప్పారయ్యా నీకు ? చచ్చి స్వర్గాన ఉన్న తాతగార్ని ఆడిపోసుకోవటం దేనికి ?"

గోపాలం చుట్టూ చూశాడు—ఎవరు చెప్పారు తనకి ? సరో చెప్పిందా? నో నో కమల చెప్పిందా ? ఆ కమల చెప్పినట్టే గుర్తు ఛ! బొత్తిగా అబద్ధాలకోరులా ఉందే! తాతగారు మామ్మగార్ని సరిగ్గా చూడకపోతే చచ్చి నరకానికి పోతాడుగానీ స్వర్గాన్నెలా కూర్చుంటాడు ?

బామ్మగారు కళ్లు ఒత్తుకుంటూ కాస్త నెమ్మదిగా అంది—

"ఎందుకు నాయనా అంత కంగారు పడ్డావు ? తాతగార్ని అనుకుంటే మహా పాపం చుట్టుకుంటుంది—ఆయన పెళ్లాన్నేవిటీ ? బిడ్డల్నేవిటీ ? వూరకుక్కని కూడా మహా ప్రేమతో చూసే వారు తే "

"అవునుమరి. చూడకపోతే ఎలా? పాపం కుక్క మాత్రం మనిషికాదూ ? దానికిమాత్రం వ్యక్తిత్వం లేదూ?"

బామ్మగారు తెల్లబోయింది—"అబ్బాయ్! నీకే మన్నా కొంచెం ఇరక తరకల్లాంటివి ఉన్నాయా ? ఆహా! మాట వరసకి కడిగాన్లే"

గోపాలానికా ధోరణంతా విసుగేసింది - ఏమిటో వెలికేస్తే కాలికీ--కాలికేస్తే వేలికీనూ—కాస్త ధైర్యం తెచ్చుకు అడిగేశాడు—"ఒక్కసారి—సరో దేవిగార్ని పిలుస్తారా?"

బామ్మగారు ఖయ్యిమంది—"బావుంది. చిన్న పిల్ల అదేం మాట్లాడగలదు ?"

నివ్వెరపోయాడు గోపాలం—అయితే తనీ ఒద్దావతారంతో మాట్లాడటానికా వచ్చాడు ? తనతో ఈవిడే వస్తుందా పిక్చర్‌కి ? బామ్మగారు కాస్త విసుగుదల ప్రకటిస్తూ, "నీ విషయాలేవో అడుగుతోంటే పిచ్చి పిచ్చిగా మాట్లాడుతూ కూర్చున్నావ్—ఇంతకీ మీ అప్పగార్నేవూరిచ్చారు?"

"ఏ వూరూ ఇవ్వలేదండీ?"

"ఏవిటీ ? ఇంకా పెళ్ళి కాలేదూ ?"

"పెళ్లయిందండీ! ఓ కూతురు కూడాను"

"అబ్బాయ్, నీ కేదో చిన్న చింత పిక్కంత... ఉన్నట్టుంది—పోనీ మీ అన్నగారికెందరు?"

" పదిమంది ఉంటారండీ!"

"ఏవిటీ ? పిల్లలే!"

"అవునండీ మీరు నమ్మరుగానీ . మా అన్నయ్య "నాకు ఖాళీ లేదు మొర్రో" అన్నా విన్పించుకోరండీ! అందరూ మా అన్నయ్యనే ప్రైవేటు చెప్పమంటారండీ! మా అన్నయ్య లెక్చరరు చేస్తున్నాడు లెండీ"

"అవుతే అబ్బాయ్! నేనడిగిందేవిటీ?"

"బామ్మగారూ! మీ రడిగిందేవిటండీ?" బిక్క మొహంతో గోపాలం! ఒక్కసారి నోటినిండా పుక్కిలింతల్లా నవ్వేసింది బామ్మగారు—"నీ అమ్మ కడుపు బంగారంగానూ! మా సరోజం అయితే నిన్ను బాగానే ఆడిస్తుంది" గోపాలం సిగ్గుపడి పోయాడు కాస్సేపు—"నాకు గేమ్స్ చాలా ఇష్టం లెండి సరోకి కూడా "



ఈ 'బల్లమీద దుమ్ముఉండలి ఏది?—అంది మీద ఫోన్ నెంబరు నోట్ చేసుకున్నాను'—

# నా డైరీలో ఒకపేజీ!

"ఏరో ఏవిటయ్యా మొర్రో అన్నట్టు లక్షణంగా సరోజం అను"

సరోజం! ప్చ్! బొత్తిగా బి సి నేమ్ ! నైస్! మిస్ సరో!

"చెప్పవయ్యా! మీ అన్నగారికి కడుపున పుట్టిన బిడ్డలెంతమందీ అని నే నడుగుతా"

"మా అన్నగారి కడుపునాండీ? ఎవరూ పుట్టినట్టు లేదండీ!"

"అదేనయ్యా! మీ వదినగారి కడుపునే అనుకో"

"వదిన! ఏంవదిన? మా అన్నయ్యకి పెళ్లెప్పుడైందండీ?"

"ఏవిటీ? మీ అన్నకి పెళ్లే కాలేదూ? మువ్వే నన్నడుగుతున్నా వేమిటి?"

"లేదండీ! మా అన్నయ్యకి పెళ్ళి కాలేదండీ!"

బామ్మగారు బుగ్గన వేలు వేసుకొంటూ అడిగింది—"పెద్దాడికి పెళ్ళి గాకుండానే నీ పెళ్లికేం కంగారొచ్చిందనీ! నీ చోద్యంకాలా!"

గతుక్కుమన్నాడు గోపాలం! తనకి పెళ్ళేవిటి? ఎవరన్నారు? నాన్సెన్స్!

"మీ నాన్నగారు నీకే ముందు చేసేస్తానంటున్నాడా?" బామ్మగారి ప్రశ్న గోపాలానికేం అంతు చిక్కలేదు. అయోమయంగా చూస్తూ, అన్నాడు "ఎబ్బె! లేదండీ! నా పెళ్లి.....మా నాన్నగారు...... లేదండి! వెధవ పుకార్లు!" విసుకున్నాడు.

బామ్మగారు క్షణం మిడిగుడ్లతో ఉరిమి చూసింది—అంతలోనే కొంచెం నవ్వు తెచ్చుకుంటూ అంది— "వెధవ పుకార్లా? అంతేనా? అయితే నువ్వు పెళ్ళెప్పుడు చేసుకుంటావ్?"

సిగ్గు సిగ్గుగా జవాబు చెప్పాడు గోపాలం— "ఏమోనండీ! నే నింకా చదువుకుంటానండీ"

"పోనీ నీకు మేనరికం ఏదైనా ఉందా?"

"అదెలా ఉంటుందో నాకు తెలీదండీ!"

"అదేనయ్యా! నీకు మేనమామలూ—మేనత్తలూ ఉన్నారా?"

ఇద్దరు మేనమామలూ — వాళ్లిద్దరికీ ఒక్కో పెళ్లాం ఉన్నారండీ!"

"వాళ్లకేమైనా ఆడపిల్లలున్నారా?"

"ఉన్నారండీ! నలుగు రైదుగురున్నారండీ! సీత వాళ్లమ్మలాగే ఉంటుందిగానీ రాధ చాలా బ్యూటిఫుల్‌గా ఉంటుందిలెండి. హైస్కూల్లో చదువుకుంటోంది కూడాను—మిగతా వాళ్లిద్దరూ అనసూయా—రమామణీ కూడా......"

"అబ్బ! పోనీవయ్యా ఆ పిల్లల పేర్లు నాకెందుకూ? ఇంతకీ మీ నాన్నకీ మీ మేనమామలకీ ఏవైనా మాట పట్టింపులు—అదే మనస్పర్థలు..... కావేషాలు......ఉన్నాయనుకుంటాను......"

"అంటే జగడాలండీ?"

"అవేలే, ఎప్పుడైనా మాటా మాటా అనుకుంటూనే ఉంటారుకదూ?"

"అవునండీ! ఎప్పుడూ మాట్లాడుకుంటూనే ఉంటారు. మా నాన్నగారంటే మా మామయ్యలకిద్దరికీ చాలా అభిమానంలెండి — ఏం చెప్పినా గౌరవింగా వింటారు."

బామ్మగారికి ఒళ్లు మండింది— "బాగుంది. ఇది మరీ బాగుంది. అవుతే మీ మేనమావలు నీకో, మీ అన్నకో పిల్ల నిస్తానంటున్నారా?"

"మా అన్నయ్యకేమో సీతని ...... నాకేమో రాధని ."

"ఉహూ! మీ తమ్ముడికి అనసూయనీ—రమా మణినీ కాబోలు"

"ఏమో! తెలీదండీ!"

"మీ మేనమామలు సంబరపడటమేనా? మీ అమ్మా, నాన్న ఒప్పుకుంటా రంటావా?"

"మా అమ్మకి ఇష్టమేలెండి. నాన్నకే ."

"ఏం? కాట్నం కావాలా? ఎంతేవిటి?"

"ఇరవయ్యేసి వేలేనా కావాలంటున్నాడండీ! పోనీ మేనమావలే కాబట్టి పదిహేనేసి వేలు "

"నాకు తెలీకడుగుతానూ! సరిపోతాయా ?"

"మరేం చెయ్యగలం? మేనమావలే కదండీ?"

"అవుతే వాళ్లివ్వగలరా?"

"వాళ్లకేం రోగమా ఏవిటండీ? ఇంకా ఎక్కువే ఇవ్వగలరు అసలు మా అన్నయ్య సీతని చేసుకో వాలంటే మరో పదివేలైనా ఎక్కువ తీసుకోవాలి స్కూటర్ కావాలని అడుగుతాళ్ళెండి"

"పోనీలే—నీ మాటేవిటి? రాధని చేసేసు కుంటావా?"

గోపాలం సిగ్గుతో తల తిప్పుకున్నాడు

"ఎందుకోయ్ ఆడపిల్లల్లా సిగ్గుపడతావ్? చెప్పు!"

"నేను మేరేజ్ గురించే ఆలోచిండటం లేదండీ!'

"అంటే రాధ గురించా?"

"కాదండీ! సారీ! మీకు ఇంగ్లీషు రాదు కదండీ! పెళ్ళి గురించి"

"మీ నాన్నగారు శాఖాంతర వివాహాలవీ ఇష్ట పడతారా?"

'అమ్మో! అలాంటివేం కుదరవ్ ఆయనకు తగని చాదస్తంలెండి పాపం పూర్వకాలం మనుషులు కదండీ!"

బామ్మగారు మరి ఓర్చుకోలేక పోయింది నొసలు ముడివేసి కళ్ళు చిట్లించి సూటిగా చూస్తూ అంది—"నువ్వు మా సరోజాని కేదో ఉత్తరం రాశావట"

అదిరిపడ్డాడు గోపాలం!

"ప్రేమించాననో ఏదో రాశావట!"

బిగుసుకుపోయాడు గోపాలం!

"పెళ్ళి చేసేసుకునేలాగే కోశావట!"

కుచించుకు పోయాడు గోపాలం

"మాట్లాడ వేమయ్యా అబ్బాయ్?"

కన్పించకుండా మాయమై పోవాలనుకున్నాడు గోపాలం!

"నువ్వు ఆస్థిగల వారి అబ్బాయివనీ చదువు కుంటూన్న పిల్లాడివనీ—మంచీ చెడా మాట్లా డచ్చని నేను కూర్చున్నాను తీరా నీ ధోరణిచూస్తే ఆకు కందదు పోకకి పొందదు—అన్నట్టే ఉంది నువ్వు సరోజాన్ని ప్రేమించి ఉత్తరం రాశావని కమల చెప్పింది నాకు- నిజం కాదంటావా అబ్బా య్?"

గోపాలానికి బావురుమని ఏడవాలనిపించింది ఏడవలేక భయంగా తల ఎత్తాడు—"రా రా శానండీ"

"మరింకేం? సరోజమంటే ఇష్టమే నన్న మాట"

"ఇష్టమేనండీ"

"ప్రేమో...... ఏదో. . .వల్లి కాదు .... అదేదో ఉందా?"

"ప్రే...... మా ?......అ ఉన్నట్టు...... నండీ!"

"అవుతే మీ నాన్నకి ఇవ్వాళే ఉత్తరం రాసెయ్"

"తెలిసిందండీ"

"ఏమని రాస్తావ్?"

"ఏమని రాస్తానండీ?"

"నా నెత్తనిరాయి"

"మీ నెత్తని రాయనాండీ?"

"అదేనయ్యా! ఇక్కడ ఫలానావారి అమ్మా యిని సరోజాన్ని బాగా ప్రేమిస్తున్నానని రాసెయ్"

"అమ్మో! మా నాన్న తిడతాడండీ!"

"ఏవిటీ? తిడతాడూ? తిట్టనీ! నీకేం భయ మూ?"

"అదికాదండీ!"

"ఏది కాదయ్యా! ఆస్తి ఇవ్వడేమోనని భయ మా? పోనీ! వెధవాస్తి! నిక్షేపంలా పిల్లని పెళ్ళి చేసుకో"

"నే నే ను ఇంకా చదువుకోవాలండీ!"

"చదువుకో నిక్షేపంలా చదువుకో నీ పెళ్లాం నువ్వూ కలిసే చదువుకోండి—పెళ్లికేం"

"మా నాన్న ఒప్పుకోడండీ!"

"మన్నా అదేమాటా? ఎందుకు ఒప్పుకోడు?"

"మా అన్నయ్యకే పెళ్ళి కాలేదండీ!"

"పోనీ వాడు మరోసారి చేసుకుంటాడు లా ఎన్ని పెళ్ళిళ్ళు కావటంలేదు ఈ రోజుల్లో!"

' "

"ఏమోయ్ మాట్లాడవ్? నీకు కట్నం ఆశ ఉందా?"

"ఎబ్బే! లేదండీ!"

"ఉన్నారే చిల్లికానీ ఇవ్వడు మావాడు తెలి సిందా? పోనీ శాఖాంతరమని భయపడుతున్నావా?"

"ఛ్ఛ! లేదండీ!"

"మరి ఏమిటయ్యా నీ ఆలోచన? పోనీ నీ చదువయ్యాకే సరోజని పెళ్ళి చేసుకుంటావా?"

ఏడుపుముఖంతో గోపాలం!—"మా నాన్న ఒప్పు కోడనుకుంటానండీ!"

"ఆమాత్రం ఒప్పించలేవూ? అదీ నీతోపాటు చదువుకుని ఉద్యోగం చేస్తుంది ఇక కట్నం దేనికి? మీ నాన్నని ఒప్పించలేవూ?"

"లేనండీ! మా నాన్న అంత అమాయకుడు కాదండీ!"

"పోనీ మీ నాన్నని ఎదిరించి సరోజాన్ని ఆఫీసు పెళ్ళి చేసుకో మీ నాన్న బాధ పోతుందిగా?"

"అవునండీ! పోతుందండీ!"

"అవుతే మీ నాన్నకి నేనే రాయించేస్తాను ఒప్పు కుంటాడా సరేసరి లేకపోయినా మొహంమీద కొట్టినట్టు ఆఫీసు పెళ్ళి చేయించేస్తాను సరేనా?'

గోపాలం ఏడుపు ఆపుకుంటూ—"బామ్మగారూ ఒద్దండీ!"

"ఏవిటయ్యా నీ ఏడుపూ? ఇంత ధైర్యస్థుడివి ప్రేమించటం ఏమిటి? ఆడకూతురికి నానా చెత్తా రాయటం నాటకం అనుకున్నావా? తమాషా చేస్తు న్నావా? తీరా పెళ్ళి చేసుకోమంటే మ్మె మ్మె బ్బె బ్బె అని నసుగుతావా?"

గోపాలం చేతి వేళ్ళు వణకటం మొదలెట్టాయి

"చెప్పవేం? మా సరోజాని కసలా ఉత్తరం ఎందుకు రాసినట్టు?" రుద్రకాళిలా హుంకరిం చింది బామ్మగారు

గోపాలం ఒణికిపోతూన్న చేతులు రెండూ నలుపు

# నా డైరీలో...

కుంటూ—"ఉ పూరికేనేనండీ సే స్నేహానికండీ"

"చాల్లే చెప్పొచ్చావ్—పూరికేనే ఆడపిల్లకి ప్రేమిస్తున్నానని ఉత్తరం రాయుట మేమిటి? నీ వెత్తి స్నేహం!"

"త......తప్పే......చేశానండీ!"

"ప్రేమిస్తున్నాడటగానీ, పెళ్ళి చేసుకోడట. ఇంకా మా పిల్లని ప్రేమిస్తూనే ఉన్నావా?"

"లే......లేదండీ! మానేశానండీ!"

"ఇంకా మరేపిల్లకైనా ఇలాంటి ఉత్తరాలు రాస్తావా?"

"రాయనండీ......అమ్మతోడు—ఇంక రాయనండీ!"

"వెర్రి వేషా లెయ్యకుండా బుద్ధిగా చదువుకుంటావా?"

"కుంటానండీ! బుద్ధిగా చదువు......"

"సరేలే! అలా దారిలోకిరా! నే పోతున్నా......" బామ్మగారు లేవబోతూ—"అమ్మో! అమ్మో! నడుం పట్టేసిందే! అమ్మమ్మ......ఒసేవ్ సరోజా!" అంటూ గావుకేక పెట్టింది.

సరోజ చిరునవ్వుతో వచ్చి నిలబడింది—"ఏం బామ్మా పిలిచావ్? నేను వంకాయలు తరుగుతున్నాను"

"అదేదో నేను చూసుకుంటానుగానీ.....నువ్విలా కూర్చో! నా నడుం పడిపోయేలా ఉంది. కాస్త నడ్డి వాలుస్తాను."

బామ్మగారు కుంటుకుంటూ వెళ్ళిపోయింది. సరోజవచ్చి ఎప్పటిలా కుర్చీలో కూర్చుంది—"ఏమండీ! అంత డల్‌గా ఉన్నారూ?" అంది మృదువుగా నవ్వుతూ—

సిగ్గుతో, ఏడుపుతో కుంచించుకుపోతూన్న గోపాలం మాట్లాడలేకపోయాడు.

"మా బామ్మ తరహాయే అంతండీ! కాస్త ఎక్కువేమైనా మాట్లాడితే మరేం అనుకోకండీ!"

"అబ్బే! లేదండీ!" గొంతు పెగుల్చుకోక తప్పలేదు.

"ఆరు దాటిపోయింది పిక్చరందదుగానీ...... ఎక్కైనా షైరు వెళ్దామా?"

"ఒద్దులెండి......" నీరసంగా నిట్టూర్చాడు గోపాలం.

"ఏం? మీకేమైనా తలనొప్పిగా ఉందా?"

గోపాలం చటుక్కున లేచి నిలబడ్డాడు—"ఇక నేను వెళ్తానండీ! పనుంది"

"ఇంత తొందరగానా? ప్లీజ్! కూర్చోండీ!"

"క్షమించండీ! మిమ్మల్ని నేను అర్థం చేసుకోలేకపోయాను" సరోజ విస్తుపోయినట్లు చూసింది—"ఏమిటి మీ రంటున్నది?"

గోపాలానికి తిక్క కుదిరింది. దేనికీ జవాబు చెప్పదలుచుకోలేదు

"సెలవు సరోజాదేవిగారూ!" అనేసి పెద్ద పెద్ద అంగ లేసుకొంటూ వెళ్ళిపోయాడు—తిన్నగా కిష్టిగాడి రూంలో దూరి చాపమీద కూర్చుని చదువుకొంటున్నవాడి ఒడిలోపడి బావురుమన్నాడు.

* * *

నిట్టూర్చుతూ కలం క్రిందపెట్టాను. పాపం గోపాలంమీద జాలి వేసింది. హృదయం బరువెక్కిందంటారే—అలాగే అన్పించింది—వాలోవున్న సాను

భూతంతా ఆఖరైపోగా వాస్తవం గుర్తు వచ్చి పరి గెత్తాను వంటింట్లోకి దేవుడా! నేనేం పాపం చేసుకున్నాను ఎందుకీ శిక్ష? అని బావురుమని మనబోయాను—కుంపట్లో ఒక్క బొగ్గయినా మిగలకుండా మసి మసీ నుసి నుసీ అయిపోయింది. అన్నం తాలూకు, ఎవరు తాలూకు, నీళ్ళ తాలూకు, ఒక్క బొట్టు కూడా గిన్నెలో మిగిలిలేదు గిన్నెంతా నల్లగా మాడి మస్పై బొగ్గై... ...ఏడ్చు కుంటూనే గిన్నె తోముకుని... కుంపటి అంటించు కుని తిరిగీ ఎసరు పెట్టాను నిజం ఎసరులాగ కాగటం మొదలు పెట్టింది—పాప హాయిగా ఎదు రింటి వారింట్లో నిద్రపోతోంటే తీసుకొచ్చి పడుకోబెట్టాను అన్నం వార్చి నాలుగు బంగాళాదుంపలు వేయించిస్నానం — ముస్తాబూ అయ్యేసరికి శ్రీవారూ — చిన్నవాడూ వేంచేశారు

"అబ్బబ్బ! వీణ్ణి తీసికెళ్లనంటే చంపావ్ నన్ను కాల్చుకుతిన్నాడు" శ్రీవారి చిరాకంతా నామీదే!

"ఏం చేశాడేం?" అన్నాను తాపీగా నానిగాడి బట్ట మార్చుతూ

"వాణ్ణే అడుగూ"

"ఏంరా? మీ నాన్నని కాల్చుకుతిన్నావా?"

"లేదమ్మా!" వాడు సుతరామూ ఒప్పుకో లేదు—"ఎత్తుకోమన్నానంతే మరేమో బిస్కత్తులు కావాలన్నానూ ఇంకా "

"అన్నట్టు అగరొత్తులు అయిపోయాయని చెప్పాను తెచ్చారా?"

"ఎప్పుడు చెప్పావ్?"

"ఇందాకే చెప్పాను గుర్తు లేదూ?"

"దబాయించకు నువ్వేం నాకు చెప్పలా"

"పోనీ చెప్పలేదనుకోండి మీకు మాత్రం తెలీదూ?"

"పాపం నువ్వు లాయర్ కావాలనుకున్నావ్ కదూ? ప్చ్! ఏదీ టవల్ టవల్ నానీ . రా! అలా నిలబడ్డావేం?"

తండ్రీ కొడుకూ స్నానం చేసి వచ్చేలోపున అన్నాలు వడ్డించాను

"కంగారులో బియ్యం సరిగ్గా ఏరలేదు రాళ్ళు ఉన్నాయేమో!" అంటూ ముందే తప్పు ఒప్పేసు కున్నాను

"ఫర్వాలేదు బియ్యమే ఎక్కువున్నాయ్ రాళ్ళ కన్నా ఏవీ కాసిన్ని వేపుడు ముక్కలు ఛ! ఛ! బొత్తిగా ఉప్పు గడ్డలే కరగలేదీ ముక్కల్లో కాస్త నూరివేసుకోకూడదూ ?"

"మొన్న చారులో ఉప్పే వెయ్యలేదని దెబ్బ లాడారుగా? అందుకని రుజువుకోసం "

"అవునుమరి రచయిత్రివి ఎలాగైనా సమ ర్థించుకుంటావ్" _

"మీతో నేనేం చెప్పుకోలేదు గొప్ప"

భోజనానంతరం శ్రీవారికి రాసిన కాయితా లిచ్చి పక్కలువేసి వీక్లీ తీసుకు కూర్చున్నాను

"ఛ! ఇదేం కథ? మీ అన్న చరిత్రలా ఉందే!"

" "

"నిన్నేనోయ్! కాస్సేపు చదువు కట్టిపెట్టు. ఏవిటీ కథ?"

"అదే నాకూ తెలీలేదు"

"మరెందుకు రాసినట్టు?"

"మీరు రాయమన్నారుగా?"

"ఈ వక్క వినయాలు మానేసి సరిగ్గా చెబు దూ! ఈ కథ నాకేం నచ్చలా."

"అసలు మీ ఎడిటింగేవిటి నా మొహం మీకేం తెలుసని ?"

"ఇన్సల్ట్!— నాకు తెలీకపోటమా? ఈ చెత్తలో అన్నీ లోపాలే"

"ఏవిటో లోపం? స్వజాతీయాభిమానమా?"

"అది నీలాంటి బుద్ధిహీనులకు"

"మరి? గోపాలరావులు లేరనా మీరనేది?"

"నువ్వెక్కడ చూశావ్?"

"అడివిలో చూశాను . .అది మీ కనవసరం

"పోనీ బాబూ! నీ ఇష్టం వచ్చినట్టే రాసుకో నా కెందుకు?" చిరుకోపం

"ఇదేనేమిటి మీ ఎడిటింగు?"

"సరే అయితే—రేపు తీరిగ్గా చూస్తాను నాకు నిద్ర ముందుకొస్తోంది. నే పడుకుంటాను లైటు మార్చు"

"ఉండండి నేను డైరీ రాసుకోవాలి"

"అఘోరించినట్టే ఉంది నీ డైరీ రాయటం లైటు ఆర్పుదూ!" అదేం విన్పించుకోకుండా డైరీ తీశాను — హతోస్మి! డైరీ రాసి తొమ్మిది రోజులైంది సంవత్సరంలో ఆరు నెలలు నిండి పోయినా డైరీలో పదిహేను పేజీల కెక్కువ రాయలేదు

"ఏమండి మీ అమ్మాయి పాటలు పాడుతుందా!" అడి గాడు రామారావుగారు.

"సాధారణంగా సొంత బాణీలో తప్ప యింకోరకం పాడదండీ పాడమన్నారా?" అడి గాడు మూర్తిగారు

"మరోసారి లెండి?" అన్నాడు రా. గారు.

రాజా కె (మప్పిరి)

"నా కాళ్ళు నొప్పు లెడుతున్నాయ్"

"ప్చ్! పాపం! ఏం చెయ్యగలరు? పడుకోండి" శ్రీవారి నీరసం— "అంతేనా సాయంత్రం నాపాద సేవచేస్తాననలా?"

"నేనా? మీపాదసేవా? సాయంత్రమా? అలాంటి అబద్ధా లాడకండి కాళ్ల నొప్పు లెక్కువవుతాయ్!"

"పోనీలే నీకే పాపం! ఇలాగే నొప్పులతో ఏడ్చు కుంటూ పడుకుంటాను—"

"ఎందుకా కుళ్ళుకోటం ? వస్తానుండండి పావుగంట—"

"నీ ఇష్టం నీకా మాత్రం స్వతంత్రం లేదే మిటి?" ఆ సోదేమీ విన్పించుకోదల్చలేదు ఏమైనా సరే ఇవ్వాళ డైరీ రాయాలి—ఏం రాయాలి? జర గటం చాలా విషయాలు జరిగాయి—అలా అలా .. నాలుగైదు పేజీలు వెనక్కి తిప్పుతూ పోయాను కాస్సేపు

ఉగాది—కష్ట సుఖాల పచ్చడైతే తిన్నానుగానీ అనుభవాల జీవితం ఎలా ఉంటుందో చూడాలి మరి.

భోగి — దాంపత్య జీవితానికే భోగిలా గడిచిన ఈ శుభ సమయంనుంచి ఆత్మశోధన ప్రారం భిస్తున్నాను.

ఈ సంసారం—మా దాంపత్యం సుఖమయం కావా లంటే అందులో నా పాత్ర ఎంత విశిష్టమైనదో నాకు తెలుసు నా బాధ్యత నిండు హృదయంతో నిర్వహించగలిగే శక్తి ప్రసాదించమని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను ఈ రోజు చాల సంతోషంగా గడి చింది ఏరోజూ ఈ రోజే అయితే ఈ ఇల్లు స్వర్గ సీమకన్నా అత్యధికమైనది. మహోన్నతమైనది.

"అ మ్మ . ." అంది పాప. . అబ్బ! ఎంత సంతోషం వేసిందనీ? ఇవ్వాళే మొట్టమొదటిసారి అంది అలా—వాళ్ల నాన్నకు చెప్పేవరకూ ఏమీ తోచకుండా పోయింది — తీరా చెప్తే ఆయనగారి వెక్కిరింపూ—"నా న్నా . అనబోయి 'అమ్మ' అనేసిందేమో తెలిక — చిన్న పిల్లకదూ?"—మీ ఉక్రోషం నాకు తెలుసులెండి" అంటూ నవ్వాను.

"ప్చ! ఈయనకీ కిళ్లీల జబ్బు తగ్గటంలేదు. పళ్ళంతా గార పట్టించుకుంటూ . ఆ కిళ్ళీలు మాస్తోంటే ఒళ్లు మంట .. పైగా తాంబూాల చర్వణం గురించో దీర్ఘోపన్యాసం!—"

పేజీలు వెనక్కి వెనక్కి తిరగబడుతున్నాయ్ ! నాకు తెలీకుండానే నా మొహంమీద నవ్వు కన్పి స్తోంది కాబోలు—"ఓహో! ఏమిటా చిద్విలాసం? కాస్త ఆ పుస్తకాలవీ కట్టిపెట్టి కాసిన్ని మంచి నీళ్లు తెస్తావా?"

"మీ తల దగ్గరే ఉన్నాయి చేయి చాపండి అందుతుంది గ్లాసు" శ్రీవారికి బాగా కోపం వచ్చింది -- "అయితే నువ్వు పగలంతా ఏం రాచ కార్యాలు చేస్తున్నట్టు? ఇప్పుడు డైరీ రాయటం ఏమిటీ?"

"డైరీ పడుకోబోయేముందు రాసుకుంటారు మీకు తెలీదు కాబోలు వూరుకోండి"

"ఈ దోమల సంగీతం విన్లేక చస్తున్నాను కాస్త కర్టెన్ దించి వెళ్ళు నిన్న చిమ్మిన మందు టానిక్‌లా పని చేసినట్టుంది వాటికి—మరీ హుషా రుగా ఆలాపన చేస్తున్నాయ్!"

నవ్వు ఆపుకుంటూ పెంకిగా అలాగే కూర్చు న్నాను టేబిల్ దగ్గర—డైరీ పేజీలు తిరగేస్తూ.

"నాకు లైటు ఉంటే నిద్ర పట్టదని తెలుసా?"

"తెలీదు"

"మరేం తెలుసు?"

"లైటు ఉంటే గాని నిద్ర పట్టదని తెలుసు"

"అలాగా? నీకు ఒంట్లో బాగా లేనట్టుంది"

"నిజమే—తలనొప్పి—రొంపా, దగ్గూ—"

"ప్లీజ్! లైటు మార్చుదూ?—నిద్రవస్తోందీ!"

"అయితే డైరీ తర్వాత రాస్తానుగానీ నేనో మాట చెప్పనా?"

"ఊ తొందరగా చెప్పు"

"చెప్పటంకాదు. శ్రద్ధగా వినండి—ఒకటిః స్టౌ బాగు చేయించుట, రెండు పాపని ఆడించటా నికో పనిపిల్లని—మన కోప తాపాలకు బెదరని ధైర్య పిల్లని ఏర్పర్చుట—మూడు తమరు ఉదయమే లేచి సాయంకాలాలలో షైర్లు తగ్గించుకుని— నాకు కో—ఆపరేషన్ నొసంగుట, నాలుగు కాస్త ఇల్లూ—ఇల్లాలూ ఉందని . " మా వారు మరి మెలకువగా ఉన్న జాడలేదు డైరీ రాసే మూడ్ పోయింది—పుస్తకం మూసేసి లైటు ఆర్పి బెడ్ రూం లైటు వేసి బద్ధకంగా లేచాను

[అయిపోయింది.]



# మీనాక్షి

రావు

## "మీనాక్షి ఎవరితోనో లేచి పోయిందట!"

హైద్రాబాదులో నెల రోజులుగా పనిమీద ఉండి, అప్పుడే తిరిగి వచ్చిన నాకు తమ్ముడు చెప్పిన ఈ వార్త చాలా ఆశ్చర్యం కలిగించింది నమ్మలేక పోయాను కాని ఎవరినోటమ్మట చూసినా ఇదే మాట.

వెంకన్నకాపుమీద జాలి వేసింది మీనాక్షి అంటే ప్రాణాలిచ్చేవాడు చెంపకు చారెడేసి కళ్ళూ మనుదీరిన ముక్కూ, తీర్చి దిద్దినట్లు కనుబొమ్మలూ కంటికి నిండుగా, తోటి వారిలో హుందాగా ఉండేది మీనాక్షి. ఆ కళ్ళలోని అమాయకత్వం మట్టుకు ఎదుటివార్ని ఇట్టే ఆకర్షించేది. అలాగని అమాయకురాలనుకొంటే, పొరపాటే అవుతుంది మాటకారి. కలుపు తీతల్లోనూ, ఊడ్పుల్లోనూ, కోతల్లోనూ, మీనాక్షి జట్టుదే పైచేయి పల్లెపదాలు పాడుతూ మీనాక్షి హుషారిస్తుంటే, ఎకరాలకి ఎకరాలు వాళ్ళ కాళ్ళక్రింద నలిగేవి. చేతుల మీదుగా పిండేవి. మీనాక్షి వాక్కు వాళ్ళకి బ్రహ్మవాక్కు.

మీనాక్షి అందానికి తోటి ఆడవాళ్ళు అసూయ పడేవారు. మీనాక్షి రూపం మగవాళ్ళ హృదయాల్లో గిలిగింతలు పెట్టేది వెంకన్న కాపు అదృష్టానికి చాలామంది అసూయ పడేవాళ్ళు మొదట్లో అలా బాధ పడిన వాళ్ళలో నేనూ ఒకణ్ణే కాని, రాను రాను వెంకన్నకాపు నామీద చూపుతుండే అభిమానం వల్లా, నా చదువుకి గౌరవ మిస్తూండడంవల్లా నా అభిప్రాయాల్ని మార్చుకొన్నాను. మీనాక్షిని గురించి ఆ తర్వాత నాకేవిధమయిన ఆలోచనలూ కలిగాయి కాపు

అసలు వెంకన్నకాపు పరిచయం నాకు ఆమె ద్వారానే కలిగింది

నా చదువు పూర్తి కాగానే ఉద్యోగాలకి వెళ్ళడం ఇష్టం లేకపోయింది నాన్న కూడా పెద్దవాడై పోయాడు పొలాల్లో గట్రా తిరిగితే ఆయన ఆరోగ్యం పాడవుతుందేమో నన్న భయంచేత, ఉద్యోగాసక్తి ఏదో ఉంటే—దాన్ని కూడా పూర్తిగా పక్కకి నెట్టేసి, వ్యవసాయంలో దిగాను పైకి "నీ కెందుకురా ఈ బెడదలు?" అని ఆయన అన్నా, ఏదో ఇంటి పట్టున ఉంటాను గదా అని కొండంత సంబరపడ్డాడు మా అమ్మ సంగతి చెప్పనే అక్కర్లేదు

నేను వ్యవసాయంలో దిగడం చాలా మంది వూళ్ళో వాళ్ళకి ఇష్టంలేక పోయింది. 'చదువెం దుకూ చట్టు బండలకీ ఇది ఆఫీసులో కూర్చుని పని చెయ్యడంకాదు 'వ్యవసాయం వ్యవసాయం' లని హేళన చేశారు అసూయతో—అందులోనూ నిజం లేకపోలేదు వ్యవసాయమంటే మాటలు కాదని, ప్రకృతితో జూదంలాంటిదని నాకు తర్వాత అనుభవంమీద తెలిసింది వాళ్ళు హేళన చేసిన కొద్దీ నాకు పట్టుదల పెరిగింది. పొలం పనులలో నాకంతగా అనుభవంలేదు. అయితే చిన్ననాటి నా స్నేహితుడు బసివిరెడ్డి నాకండగా నిల్చాడు.

వ్యవసాయం మొదలు పెట్టిన రోజునించీ కిట్టనివాళ్ళు, అసూయాపరులు నా కెన్నో ఆటంకాలు కలిగించారు లన్నీ బసివిరెడ్డి సహాయంతో ఎదుర్కొంటూ వచ్చాను ఊడ్పుల సమయం వచ్చేసరికి జనం దొరికారు కారు పక్క ఊళ్ళు వెళ్ళి రెండుసార్లు రెండు జట్లు జనాన్ని బేరమాడుకువస్తే, నామీద లేనిపోనివన్నీ చెప్పి వాళ్ళని తమ

పొలాల మీదకు తిప్పుకొన్నారు. పంతంకొద్దీ అందరూ రోజుకు రూపాయిన్నర ఇస్తుంటే రెండు రూపాయి లిస్తానన్నా ఎవరూ రాలేదు.

ఆ రోజున పొలం గట్టుమీద దిగాలుపడిపోయి నించున్నా. ఆకుమళ్ళు ముదిరిపోతున్నాయి. బసివిరెడ్డి నా పక్కనే గట్టుమీద కూర్చున్నాడు. గడ్డిపోచ కొరుకుతూ.

మొదటిసారిగా మీనాక్షిని అప్పుడే చూశాను.

నెత్తిమీద చద్దికూడు ముంత పెట్టుకొని, నుదుట కాణీ అంత బొట్టుతో, కాళ్ళకున్న కడియాలు చప్పుడు చేస్తోంటే, వయ్యారంగా అవతలి గట్టమ్మట నడిచి వెడ్తోంది మీనాక్షి. ముందర మమ్మల్ని చూడలేదు. ముక్కుమీద వేలేసుకొంటూ, "ఏమిటీ విడ్డూరం? విశ్వనాధంగారి పొలంలో ఈ ఏడాదింకా ఊడ్పులు ప్రారంభమే కాలేదు!" అంది గట్టిగానే.

"చదువుకున్నవాడు వ్యవసాయం చేస్తే అంతే మరి!" అన్నాడు బసివిరెడ్డి నవ్వుతూ నా వైపు చూస్తూ. రెడ్డి మాటలు విని, మీనాక్షి మాకేసి చూసింది. చటుక్కున ఆగిపోయింది. నెత్తిమీద చద్దికూడు చేత్తో పట్టుకొని, నీటి బోదె మీదుగా చంగున మేమున్న గట్టుమీదకి దూకింది. విస్తుపోయి చూస్తున్నాను. నేను తలంచని విధంగా మీనాక్షి నన్ను చూస్తూ, "మీరు......" అంటూ ఆగిపోయింది.

"విశ్వనాథంగా రబ్బాయిని" సమాధాన మిచ్చాను. అంతవరకూ కూర్చున్న బసివిరెడ్డి ఒక్కసారిగా లేస్తూ, "తండ్రి ముసిలివాడయ్యాడు కదా అని, అంత చదువూ చదువుకొని ఉద్యోగాలకి వెళ్ళకుండా వ్యవసాయంలో దిగాడు. కిట్టనివాళ్ళ మూలంగా జనం దొరక్కుండా పోతున్నారు. నీ జట్టుతో నువ్వు వస్తివా, మనిషికి రెండు రూపాయిలు దొరుకుతాయి" అన్నాడు మీనాక్షికేసి చూస్తూ.

"నిజంగానా?!" మీనాక్షి అంది, కళ్ళింత చేసుకొని. నే తలూపాను. "అయితే బాబూ రేపు ఉదయం మీ పొలం పనికి నా జనంతో వస్తా" అంటూ నీటి బోదె దాటి మీనాక్షి వెళ్ళిపోయింది.

ఏదో పరిహాసానికలా అందనుకొన్నానుగాని, మర్నాడుదయం పొలానికి వెళ్ళగానే ఊడ్పులకి సిద్ధమవుతున్న జనాన్ని చూసేసరికి నాకు ఆశ్చర్యమేసింది. పక్క పొలంలోంచి నారాయణ పరుగెత్తుకొంటూ వచ్చి, మీనాక్షిని అడుగుతున్నాడు—తమ పొలంలోకి వచ్చేయవల్సిందిగా.

"ఏం మనుష్యులయ్యా మీరు!? కొత్తగా వ్యవసాయంలోకి దిగితే సహాయం చేద్దామనే బుద్ధి లేదు. పైగా ఆటంకాలు కల్గించడం" మీనాక్షి సమాధానం విని, నారాయణ మొహం ఒక్కసారిగా ఎర్రగా అయిపోయింది. నాకేసి, అప్పుడే వచ్చిన బసివిరెడ్డికేసి, మీనాక్షికేసి గుర్రుగా చూస్తూ వెళ్ళిపోయాడు నారాయణ.

"చినబాబుగారు అర్ధరూపాయి ఎక్కువిస్తున్నారన్న సంతోషమేకాదు. అందుకు తగ్గట్లుగా మీ శక్తి చూపించాలి మరి" అంది మీనాక్షి. మీనాక్షి మాటలు విని, హుషారుగా కేకలు వేసుకొంటూ అందరూ మళ్ళలోకి దూకారు.

పంచాయతీబోర్డు ఎన్నికలు జరుగుతున్నాయి. ఊరంతా హడావుడిగా ఉంది. పొలంలో ఉండ బుద్ధి వెయ్యక నేనూ బసివిరెడ్డి వూళ్ళోకి దారి తీశాం. సాయంత్రం డబ్బు తీసుకొని పొలానికి వెళ్ళేసరికి ఊడ్పు జనం కాళ్ళూ చేతులూ కడుక్కొని గట్లమీద నిల్చున్నారు. మీనాక్షికి ఏకమొత్తంగా డబ్బు లెక్కకట్టి ఇచ్చేశాను. డబ్బు అందుకుంటూ అంది మీనాక్షి.

"చేలలో ఊడ్పులుకాని, కోతలుకాని జరుగుతోంటే మేం చురుగ్గా పని చెయ్యమేమో అని యజమాన్లు గట్లమీద గొడుగు లేసుకొని పడికాపులు పడుతూ కూర్చుంటారు. చినబాబుగారూ, మరి మీరు మమ్మల్ని అలా వదిలేసి పోయారు కదా! మేం నీర్సంగా పని చేస్తే?" మీనాక్షి మాటల్లో అనుభవంతో కూడిన హెచ్చరిక ఉంది. సున్నితమైన హాస్యముంది. హఠాత్తుగా తలవని తలంపుగా నా హృదయంలో ఓ స్థానం ఏర్పరుచుకొంది మీనాక్షి.

"మీమీద నాకా నమ్మకముంది కాబట్టే అలా చేశాను. లేకపోతే వాళ్ళకీ నాకూ తేడా ఏమిటి?" అన్నాను నవ్వుతూ, పక్క పొలాలవైపు వేలెట్టి చూపుతూ.

సెలఏరుల గల గలలా, పక్షుల కిల కిలలా మీనాక్షి అందంగా, కమ్మంగా నవ్వింది. జట్టుతో కదిలి వెళ్ళిపోయింది. బసివిరెడ్డి వచ్చి భుజంమీద తట్టినప్పుడుకాని, ఈ లోకంలోకి రాలేకపోయాను.

ఆరోజు రాత్రి భోజనం చేసిన తర్వాత అరుగు మీద కూర్చున్నా, తమ్ముడితో మాట్లాడుతూ. భుజంమీద కండువా వేసుకొనివచ్చినతన్ని చూస్తూ "ఏం కావాలోయ్?" అని ప్రశ్నించాను.

"మీతో మాట్లాడే పనుంది. నా పేరు వెంకన్నకాపు. మీనాక్షి భర్తని" నాకు నవ్వు వచ్చింది. ఆపుకోలేక నవ్వేశాను. అయితే వెంకన్నకాపు ఏమీ అనుకోలేదు. "మీ మనసు చాలా మంచిదట బాబుగారూ! అది చెప్పింది. ఏదో మీబోటివారి దయవల్లే మాలాటి వాళ్ళం జీవించకల్గుతున్నాం. సంస్కారమున్న ప్రభువులు మీరు......" వెంకన్నకాపుని మధ్యలో ఆపుచేసి నేనేదో అనబోయేలోగానే తమ్ముడనేశాడు. "మా అన్నయ్యని ఉబ్బేస్తే చాలా కష్టం. చొక్కా చిరిగిపోతుంది. ఇంతకీ అసలు నువ్వెందు కొచ్చినట్లు?"

"పనిలేక బాధపడ్తున్నా బాబూ. మీలాంటి ప్రభువులు తలుచుకొంటే చేయలేంది ఏముంది? మీరేదైనా బ్రతుకుతెరువు చూపిస్తారన్న ఆశతో వచ్చాను"

"ఇంతవరకూ ఎలా గడుస్తోంది?" తమ్ముడు జబర్దస్తీగా అడేగేస్తున్నాడు. నేనూ సర్దాగా చూస్తున్నాను.

"ఏదో దాని సంపాదనే బాబూ! ఏవో చిల్లర మల్లర పనులు అప్పు ప్పుడు చేస్తున్నాను. సంసారం గడవడం కష్టంగాఉంది" దీపం వెలుగులో వెంకన్నకాపు మొహం దీనంగా కనిపించింది. జాలి వేసింది నాకు. నాన్నగారి తరంనుండి పని చేస్తున్న పాలికాపు ముసలివాడయిపోయాడు. ఈ పాలికాపుతనం కూడా, కరిణీకంలా వంశపారంపర్యా వచ్చే అలవాటుంది సాధారణంగా. అయితే పైడయ్య కొడుకు ఖార్కానా పనికోసం పట్నంలో స్థిరపడ్డం వల్ల మరొకర్ని చూసుకోక తప్పదు. వెంకన్నకాపుని పాలికాపుగా నియమించేశాను వెంటనే, వేరు ఆలోచన లేకుండా. ఆనందంగా వెళ్ళిపోయాడు వెంకన్నకాపు.

మర్నాడుదయం పొలానికి వెళ్లేసరికి బాగా ఆలశ్యమైపోయింది. ఊడ్పు వెంకన్నకాపు ఆధ్వర్యంలో చకచకా సాగిపోతోంది నన్ను చూడ్డంతో మీనాక్షి మడిలో అడ్డంగా పరుగెడ్తూ వచ్చింది. చేతులెత్తి నమస్కారం పెడ్తూ, "ధర్మప్రభువులు. పదికాలాలపాటు చల్లగా ఉండాల' అని తిరిగి వెళ్ళిపోయింది జనం మధ్యగా. వెళ్తూ, బురద చేతులతో కొంగుతీసి కళ్ళు తుడుచుకొంది మీనాక్షి. ఆ కన్నీళ్ళు మాటలవసరం లేకుండానే కృతజ్ఞతని తెలిపాయి.

వ్యవసాయంలో చాలా బాధ్యతలు వెంకన్నకాపు తన మీద వేసుకోవడం,వల్ల నాకు కష్టమనిపించింది కాదు. సామర్థ్యంగా తన పని నెరవేర్చుకు పోతున్న వెంకన్నకాపుని చూసి నాకు చాలా గర్వంగా ఉండేది. రాను రానూ నాతో చాలా చనువు ఏర్పడిపోయింది వెంకన్నకాపుకి. గట్టుమీద కుర్చీ వేసుకుని కూర్చుంటే పక్కనే కూర్చుని విసుగనిపించకుండా ఏవో కబుర్లు చెప్పేవాడు.

"మా మీనాక్షి మనసు వెన్నలాంటిది బాబూ. ఒక్కపూట ఇంటి కాలశ్యంగా వెడ్తే చాలు! 'సమయానికి తిండిలేకపోతే ఆరోగ్యం పాడవదూ?' అంటుంది. అప్పుడేం జవాబిస్తానో తెల్సునాండీ? 'చినబాబుగారేదో పని చెప్పారు' అంటానంతే. మరి తిరుగు సమాధానం చెప్పదు. అక్కణ్నించి 'ఆయన చెప్పిన పని సరిగా చేశావా లేదా? ఆయన మనసు మంచిది అందుకే మనకీనాడు హాయిగా జీవితం వెళ్లిపోతోంది. చినబాబుగారి మనస్సుని కష్టపెట్టక చెప్పిన పనల్లా చేస్తూండు మరి' అంటూ మొదలు పెడ్తుంది. భోజనం పెట్టాలన్న ధ్యాసే ఉండదు! చినబాబుగారంటే దాని కంత అభిమానం!"

నా మనస్సెదోలా అయిపోయేది. వెంకన్నకాపు ఎంత నిర్మలంగా ఉంటాడు. హృదయమిచ్చి మాట్లాడుతుంటే, మీనాక్షిని గురించి కలిగిన ఆలోచనలకు, నాకు నేనే సిగ్గుపడిపోయేవాణ్ని. అతి ప్రయత్నంమీద కలలో కూడా అటువంటి ఆలోచనలు రాకుండా చేసుకో కలిగాను. ఆ తర్వాత వెంకన్నకాపుతో ఏదో నేరం చేసినట్లుగా కాకుండా మామూలుగా ఉండగలిగాను.

ఓ రోజు సాయంత్రం పొలం గట్లమ్మట నేనూ, వెంకన్నకాపూ నడిచి వస్తున్నాం. ఉన్నట్టుండి వెంకన్నకాపు నన్ను పక్కకి తోశాడు. తోపు కాగలేక పక్కనున్న మడిలో పడ్డాను. బట్టలన్నీ బురద కొట్టుకుపోయాయి. కోపంతో లేచాను. నీటి బోదెలోకి దిగుతున్న త్రాచుపాముని చూచేసరికి నా పై ప్రాణాలు పోయాయి. భయం లేదన్నట్లుగా వెంకన్నకాపు తలూపాడు. నీళ్ళలోకి దిగిన తర్వాత అది మరి కనిపించలేదు. వెంకన్నకాపు చేయూతనిచ్చి, నన్ను గట్టుమీదకు లాగాడు. "ఒక్క క్షణం తప్పింది. లేకపోతే మీరు దానిమీద అడుగేసేవారు!" వెంకన్నకాపు కేవిధంగా కృతజ్ఞత చెప్పుకోవాలో నాకు తెలియలేదు.

మర్నాడుదయం వెంకన్నకాపుతోబాటు మీనాక్షి కూడా వచ్చింది. "చినబాబుగారూ! భగవంతుడి దయవల్ల గండం తప్పింది. మీరు సుఖంగా ఉంటేనే, మాలాంటివాళ్ళు జీవించగల్గేది. ఇదిగో బాబూ దేవుడి ప్రసాదం. గండం గడిచినందుకు మేం ఇద్దరం గుళ్ళోకి వెళ్ళి వచ్చాం" అంటూ ప్రసాదం ఇచ్చింది.

అప్రయత్నంగా నా కళ్ళు నీళ్ళతో నిండిపోయాయి. ఎంత అభిమానం! నేనంటే ఇద రికీ.

తప్పేది—లేచిపోయిందా? ఇదెలా సంభవం? నాకు మతిపోయింది. లోకంలో చిత్రమైన సంగతులు జరుగుతుంటాయి. ఎదుటివాడు చెప్తే సునాయాసంగా కట్టు కథలని తీసి పారేస్తాం. స్వంత అనుభవంలో జరిగితే కలో, నిజమో తెలియక మధనపడ్తాం. నేనూ అదే పరిస్థితిలో ఉన్నాను.

మామిడిచెట్టుకింద చుట్ట కాలుస్తూ, ఉదా

## మీనాక్షి

సీనంగా ఉన్న వెంకన్నకాపు కనబడ్డాడు. నన్ను చూడ్డంతోటే చుట్ట అవతల పారేసి, లేచి వీరసంగా అడుగులేసుకొంటూ వచ్చాడు. వెంకన్నకాపునే అడిగి తెల్సుకొందామన్న ధైర్యం లేకపోయింది. ఏమని అడిగేది? అయినా ఉండబట్టలేక అనేశాను''

"ఏం వెంకన్నకాపూ! ఏ విన్నది...".

"విన్నానుబాబూ! దాని పూసు నా దగ్గరెత్తకండి బాబూ! దాని ప్రేమంతా బూటకమని, ఇంత నీతిమాలినదని జన్మలో అనుకోలేదు!" వెంకన్నకాపు శూన్యంగా ఎటో చూస్తూ అన్నాడు.

"ఇంతకీ ఎవరితో......"

"వాడెవడో తెలిస్తే నెత్తురు కళ్ళజూస్తాను. అయిందేదో అయిపోయింది చినబాబుగారూ. పడమటి గాలి ఇదిగా ఉంది. కుప్పలు పడకొట్టేం

చేస్తే బావుంటుంది'' మాటలు తప్పించేశాడు. నాకూ వెంకన్న కాపుని మరి బాధ పెట్టడం ఇష్టం లేకపోయింది.

''రేపు ప్రొద్దున్న పడగొట్టించు'' వెంకన్న కాపుతో చెప్పి ఇంటికి దారి తీశాను.

బసివిరెడ్డి వూళ్లో లేడు. నే వచ్చే ముందే ఏదో వూరు వెళ్ళాడుట. ''కొంపతీసి బసివిరెడ్డి కాని.....'' అక్కడితోటే ఆగిపోయాను. అటు వంటి అనుమానం కలిగినందుకు చాలా బాధ పడ్డానుకూడా.

సంతకం చేయించుకొని, రిజిష్టర్డు కవరు ఇచ్చిపోయాడు పోస్టుమాన్. బసివిరెడ్డికి, రిజిష్టర్డు కవరు వ్రాయవలసిన అవసరమేముందా అని ఆశ్చర్యపడూ కవరు చింపాను.

''రామం,

చిన్ననాటి నీ స్నేహితుడు నీకు దూరంగా ఉండి భయపడూ, తన్ను తనే అసహ్యించుకొంటూ వ్రాస్తున్న ఉత్తరమిది. నే నిటువంటి నీచపు పనికి పడిగట్టానని తెలిసి నువ్వు బాధ పడ్తావు. అయినా ఈ లోకంలో నా బాధ తెల్పుకోడానికి నువ్వుతప్ప ఇంకెవరున్నారు?

మీనాక్షిని చూసిన రోజు దగ్గర్నించీ నే పడ్డ బాధ వర్ణనాతీతం. ఎప్పుడు, ఏవేళ ఏ పని చేస్తున్నా చిరునవ్వు చిందే ఆ మొహం, అమాయకత్వంతో కూడిన అందం, గడుసుతనం వ్యక్తం చేసే మాటలూ— నన్ను వెంటాడేవి. మీనాక్షి నా హృదయంలో అశాంతి రేపింది. ఆమెను నాలో లీనం చేసుకోవాలనే బలీయమైన వాంఛ నాలో ప్రబలింది. అరికట్టలేకపోయాను. ఆశక్తున్నావడం చేత మనోనిగ్రహంలేకపోయింది. మంచి చెడులు ఆలోచించే శక్తి నశించిపోయింది.

హైద్రాబాద్ వెళ్ళావు నువ్వు. కోతలయిపోయాయి. పనలు మళ్ళలో ఎండుతున్నాయి. వెంకన్నకాపు రాత్రిళ్ళు పొలంలో పడుకొంటున్నాడు.

పుచ్చపువ్వులా వెన్నెల ఉంది. చలిగా ఉంది. నిద్ర పట్టలేదు. మీనాక్షి కళ్లెదుట ఉన్నట్లనిపించింది. వక్రమార్గం పట్టక తప్పలేదు.

ప్రశాంతంగా నిద్రపోతోంది మీనాక్షి. గూటిలో ఉన్న కిర్సనాయిలు దీపం కాంతి మీనాక్షి అందానికి జిలుగులు పెడ్తోంది.

నా కౌగిలిలో చిక్కుకొన్న మీనాక్షికి మెలకువ వచ్చి, గుర్తించింది. దీనంగా ప్రార్థించింది. మొర పెట్టుకుంది. పెనుగులాడింది. అరవకుండా నోరు నొక్కేశాను. మీనాక్షి గోడు వినే సహనం, శక్తిలేని దుర్బలుణ్ణైపోయాను. తీవ్రమైన నా కోర్కెలకు బలైపోయింది మీనాక్షి.

''ఇంత జరిగింతర్వాత ఇక్కడుండడ మెందుకు? పదండి, పట్నం పోదాం'' అంది మీనాక్షి. నన్ను నేనే నమ్మలేకపోయాను. మీనాక్షి నోటమ్మట ఆ మాటలు వచ్చినందుకు అదే రాత్రి రైలెక్కేశాము.

పట్నంలో రెండు రోజులు గడిచిపోయాయి. మూడోరోజు సాయంత్రం మల్లెపూలు కొని పెట్టమంది. మురిసిపోతూ కొన్నాను. కొప్పులో పూలు తురుముకొని సింగారించుకుంది. సముద్రపొడ్డుకు వెళ్దామంది. టాక్సీ చేయించుకొని వెళ్ళాం. జన సమ్మర్దంగా ఉంది. ''వీళ్ళందర్నీ చూస్తే భయంగా ఉంది. ఎవరూ లేనిచోటికి దూరంగా పోదాం పదండి'' అంది. రెండు మైళ్ళు నడిచి నిర్మానుష్యంగాఉన్న చోటు చేరుకొన్నాం.

కెరటాలు ఉవ్వెత్తుగా లేచి పడ్తున్నాయి. మీనాక్షి కేరింతాలు కొట్టింది. పరుగెత్తి ఆట లాడింది. ఇద్దరం అలిసిపోయాం. ఇసకలో పడుకొన్నాను. మీనాక్షి నా కళ్ళలోకి చూస్తూ, నా గుండెలమీద తల ఆన్చి పడుకొంది. చిలిపిగా నవ్వింది కమ్మగా, తీయగా మాట్లాడుతోంటే మైకం కమ్మినట్లయింది. హఠాత్తుగా గుప్పెడు ఇసుక తీసి కళ్ళలోకి కొట్టింది. హాస్యాని కనుకొన్నాను. గుండెలమీద బరువు తేలికయిపోయింది. కళ్ళు పది నిముషాలవరకు తెరవలేక బాధపడ్డాను. తమాయించుకొని చూసేసరికి మీనాక్షి లేదు. ఎప్పుడో సాగర గర్భంలో కలిసిపోయింది.

మీనాక్షి పట్నం వెళ్దామన్నప్పుడు పొంగిపోయాను. కాని, ఆ మాటలు ఇటువంటి ఘోరానికి తలపెట్టి అందని గ్రహించలేకపోయాను. జీవితంలో నేపెద్ద పొరపాటు చేసేశాను రామం. చక్కటి కాపురంలో చిచ్చు పెట్టాను. నిప్పులాంటి మనిషి. నా చేతలకి ప్రాణా లర్పించింది. నేనూ అదే దారి పడ్దామనుకొన్నాను. ధైర్యం లేకపోయింది. పిరికివాళ్ళు తలపెట్టే పని ఆత్మహత్య అంటారు. కాని చేతులారా జీవితాన్నంతం చేసుకోవడానికి ఎంత ధైర్యముండాలి? లాభం లేదు రామం. ఆ పని నేను చెయ్యలేకపోయాను. జీవితాంతమూ కఠోరమైన వేదన ననుభవిస్తూ, దొంగలాగ జీవించవల్సిందే. అదే నాకు శిక్ష.

నువ్వు వస్తున్నావని తెల్సి, నే వూరు వదిలి వెళ్ళి నీకీ ఉత్తరం వ్రాశాను. ఎదుటబడి చెప్పే ధైర్యం లేక. రెండు రోజుల్లో వస్తున్నాను. నీ ఎదుట పడగానే ఏం చేస్తావో......?

నీ స్నేహితుడు
బసివిరెడ్డి''

ఉత్తరం చదివి నిర్ఘాంతపోయాను. ఎంత ఘోరం జరిగిపోయింది?! బసివిరెడ్డి ఎంత నీచానికి దిగిపోయాడు! 'నువ్వు మట్టుకు ఆశించలేదూ? నిగ్రహం ఉంది కాబట్టి నిలదొక్కుకొన్నావు. బసివిరెడ్డికి ఆ నిగ్రహం లేదు కాబట్టి నీగిపోయాడు. అంతరాంతరాల్లోంచి ఎవరో వెక్కిరించినట్లయింది.

వెంకన్నకాపు ధాన్యపు బస్తాలు బళ్ళ కెక్కించి తీసుకొని వచ్చాడు. కూలివాళ్ళు గాదెలోకి ధాన్యం నింపుతున్నారు. ''వెంకన్నకాపూ! నీ మీనాక్షి నిప్పులాంటి మనిషి'' అరిచాను. కాని ఒక్కమాట కూడా పైకి రాలేదు. గొంతుకలోనే అణగారిపోయాయి. లాభంలేదు. బసివిరెడ్డి చిన్ననాటి స్నేహితుడు. వెంకన్నకాపు నిర్మలమయిన మనిషి. నిజం వెల్లడి చేసి దారుణ రక్తపాతానికి, అటుపైన జరిగేదానికి భీభత్సానికి నేను కారణభూతుడనవలేను. ఉత్తరాన్ని ముక్కలుగా చింపేశాను. ఈ రహస్యం నాతో అంతమయిపోవాల్సిందే. అయితే లోకం మీనాక్షిని కులట అంది. వెంకన్నకాపూ అలాగే అనుకొంటున్నాడు. కాదని నాకు తెలుసు. ఈ సంగతి వెల్లడి చెయ్యలేని అసమర్థుణ్ణి నేను. ★



" ఆఁ .... అదో రిక్షాఎక్కి అలా వెళ్లింది ...." మరేం ఆవిడేమో కోపంగా ఉంది .... నీ పెళ్ళి కూడా ...."

"హే భగవాన్ !" సురేఖ బెంగపడిపోయి సర్దుకుని "మరేం లేదులే పాపా! ఆవిడ నాపెళ్ళి బాగు చేయించడానికి వెళ్లింది" అని గబగబా పందిరి దాటి రోడ్డుకేసి వెళ్లింది.

కాని ... కాని .....

"ఏంచెయ్యాలి ?"

# ప్రేమ కుఃపగ్గాలు

19 వ పేజీ తరువాయి

సురేఖకు కాళ్లల్లో సత్తువ పోయింది. విపరీతమైన కోపం వచింది.

"ఛీ ! గంగలో దూకమను ! మనుషులన్న తరువాత మనుషులకు విలువ నిచ్చి అర్థం చేసుకోగలగాలి.... " అని బాధపడ్డది.

"గంగలో దూకమను .... గంగలో దూకమను?"

"గంగ ?! క్రిష్ణానది ?! పద్మావతి?"

"అమ్మయ్యో ! భాస్కరంగా రెక్కడ ?"

సురేఖకు అధైర్యం కలిగింది. ఒక ఆత్మహత్యా పాపం తన పీకెలకు ఒక జీవితమంతా చుట్టుకుంది.

"ఛీ ! ఛీ ! చవట పెద్దమ్మ .... ప్రేమించాడట? ప్రేమా ? ...."

కోపమంతా భయంగా మారి భయం భాస్కరం మీద అసహ్యంగా మారింది.

"ఎక్కడ ? ఎక్కడ ? భాస్కరంగారు భాస్కరమ్‌గారట !" వెతుకుతున్నట్లు తెలియకుండా పదిమందిలోనూ, అవహాస్యంపాలు గాకుండా వెదకాలి .....

భాస్కరం వస్తున్నా డటునుంచి, బజారు నుంచి కర్పూరం కాడలు కొనుక్కుని.

సురేఖను చూడగానే చిన్న మనిషై పోయి "ఉహూహూ .... వచ్చారుగా ! పద్మావతి ఎక్కడ ? అన్నాడు. నవ్వు తెచ్చుకుని.

ఎంత కోపం వచ్చిందో అంతా పెదవిమీద మునిపంట నొక్కుకుని—

"పద్మావతి యిప్పుడే వెళ్లిపోయింది" అన్నది సురేఖ.

"ఆఁ ! వెళ్లిపోవడమా ?" భాస్కరం నమ్మలేకపోయాడు.

'పైగా మీ చతురతవల్ల నామీద నిష్ఠూరాలు వేసి మరీ వెళ్లిపోయింది."

"త్వరగా వెళ్లండి అది కృష్ణలో దూకుదేమో " అని కూడా చెబుదా మనుకున్న సురేఖ ఆ మాటలను మింగేసింది. పై మాటలను మాత్రం కసిగా అన్నది ఆమె కళ్లల్లోని ఆందోళనను చూస్తూనే భాస్కరం నీళ్ళు గారిపోయాడు.

"ప్లీజ్ ! దయచేసి చెప్పండి ! ఏం జరిగిందో" నన్నాడు.

"మా దొడ్డమ్మ మీ పిన్నిగారు మాట్లాడుకోడంలో మీమీదా, నామీదా కోపం వచ్చింది .... వెళ్లిపోయింది ...."

సురేఖ అతనివేపు క్రోధంగా చూస్తూ చెప్పింది.

"ఎటు ? మై గుడ్నెస్ .... నేనేం చెయ్యనూ?" భాస్కరం ఆ 'కర్పూరం పూలు' ఆమె చేతుల్లో పడేశాడు.

"నేను వెళ్లనా ?" అన్నాడు.

"కాని ఎటు అని వెతుకుతావు ?" మొదట యిక్కడ యీ వందలాది జనం ఎదుట, యీ అకారణ ఉపద్రవం గురించి ఏమని చెబుతావు ?" అన్నట్టు చూసింది సురేఖ.

"ఔను ! .... ఔను ! నా కర్మ !" భాస్కరం అక్కడే పందిరి గుంజకి చేరబడి పోయాడు.

అట్నుంచి ఎవరో నలుగురు వచ్చి "రా బాబూ! అక్కడ కాఫీలు నలుగురు పెద్దలకీ యివ్వాలి...." అంటున్నారు.

"పదండి వస్తారు .... ఆయనకు కాస్త తల తిరుగుతోంది ...." సురేఖ తాను రెండడుగులు వేయబోయింది. కాని ఆ మాటలు మరింత ఉపద్రవ కారణాలయ్యాయి.

ఒకతను "అరె ! అలాగా ?" అని పాలిపోయి పీక్కుపోయిన భాస్కరం మొహం చూసి "ఏం బాబూ ? కాస్త విశ్రాంతి తీసుకో" అంటూ సానుభూతి చూపబోతే .....

"ఔను మరీ ! పెళ్లి బరువా ? మరొకటా ? పైగా ఎంతైనా చెల్లెలు పెళ్లి కదా ?" అంటూ

పరిశీలనగా చూడబోయాడు.

భాస్కరం ఆ యిద్దర్నీ పీకె పిసికి చంపేద్దునా ? అనుకున్నాడు. ఇంతలో మరో పెద్ద మనిషి యీ వార్త కాస్త జానికమ్మ, ధనమ్మల చెవిని వేశాడు.

ఆ యిద్దరూ ఎలా ఉన్నవాళ్లలా పరుగెత్తుకు వచ్చారు.

భాస్కరం నిజంగా కూలబడ్డాడు. సురేఖ, వసంత కూడా రాకండా కాపాడాలన్నట్టు పెళ్లి కూతురున్న గదివేపు నరాల్లో బలం పుంజుకొని వెళ్లిపోయింది !

"అమ్మా ! నాకేం లేదమ్మా ! కాస్త ఎండ అంతే" భాస్కరం లేచి "పదండి" అనబోయాడు.

"ఉహూఁ ! కాస్త నిమ్మరసం తాగందే లేవనివ్వకండి వొదినా ?" కూచుని కొంగుతో అతని మొహం తుడిచి విసనకర్రతో విసురుతూఉన్న జానికమ్మగారిని ధనమ్మగారు హెచ్చరించింది.

పళ్లు పటపట కొరకడం తప్ప గుండెల్లో పగులుతున్న అగ్నిపర్వతాలను అట్టే అదుముకోడం వినా ఏం చేయలేకపోయాడు భాస్కరం.

ఎట్టకేలకు మరి పదినిముషాల్లో భాస్కరం తల్లితో కలిసి మామూలుగా నాలుగూ చూస్తూ ఉన్నా మరో గంటదాకా సానుభూతి పరంపరలు, "ఏం జరిగిందిటా ?" ప్రశ్నలవర్షం ఆగలేదు.

భాస్కరం మతి పోయిం దెప్పుడో. "పిన్నీ ! సురేఖతో వచ్చిన అమ్మాయికి టెలిగ్రాం ఏదో వచ్చిందిట ! వెంటనే రమ్మనీ" అన్నాడు.

"అయ్యో పాపం ! ఎలాగరా మరీ, వాళ్ల దేవూరు ? ...." ఆమె బాధపడ్డది.

"విశాఖపట్నం .... ఒక్కర్తే వెళ్లిందిట. స్టేషన్‌కి. ఈ రైల్లోనే వెళ్తానందిట."

"అయ్యో ! ఆ అమ్మాయి ? పరాయి ఆడకూతురు కదా ? మనకి అప్రతిష్ఠరా ! ఎలా ? ఎవర్నేనా పంపకపోయావూ సాయం ?" ఆమె భర్తకోసరం అటూ ఇటూ చూసింది.

భాస్కరం అన్నాడు "అక్కర్లేదమ్మా. ఇట్టే పోయి నేనే దిగబెట్టి వచ్చేస్తా .... " వన్నాడు "వూఁ" అంటే పరిగెడదామని ఉంకిస్తున్నట్టు.

"ఉండు .... పెళ్లికి వచ్చిన పడుచు .... పసుపూ ...... "

"అబ్బ ! అది కాదమ్మా ! ఆ అమ్మాయి వెళ్లిపోయింది." మొహాన చెమటలు పోయగా విసుక్కుంటున్నట్టు అన్నాడు భాస్కరం.

కొడుకు ఆందోళన ఆమెకు అవగాహన కాలేదు.

"ఊఁ ఐతే .... వెళ్లిరా .... త్వరగా."

*　　*　　*

భాస్కరం సైకిలెక్కి వెళ్లిపోయాడు. నలుగురూ చూసి తన నంత అడావుడిగా వెళ్లిపోయిన భాస్కరం వైనం అడిగితే ఏం చెప్పాలి ? అన్నట్టు రెండు క్షణాలు ఆలోచిస్తూ అక్కడే నిలబడిపోయింది జానికమ్మగారు.

"వసంత పెళ్లయిపోయింది. ఇంకేం కావాలి? తనకి ? ఇంకెవరూ తన నేమీ చెయ్యలేరు !" చాలా ధైర్యంగా రివ్వు రివ్వున సైకిలెక్కి వెళ్లి స్టేషన్‌లో దిగుతూనే ప్లాట్‌ఫారమంతా వెతికేడు భాస్కరం.

కాని పద్మావతెక్కడ ?

భాస్కరం ఎవరిని అడుగుతాడు ? ఏమని అడగాలి ?—

ఫలానీ పోలిక లున్నాయి—ఫలానీ పేరుగల అమ్మాయి యిలా వచ్చిందా ? అని అడగాలి. కాని ఎవర్ని ?....

అప్పుడే ఒక పాసింజర్ రాజమండ్రికేసి వెళ్లిందన్నారు. అందులో వెళ్లిపోయి ఉంటుంది !

"ఔను ! ఇప్పటికే పద్మావతి పూర్తిగా కారాలు — మిరియాలు నూరుతున్నది. ఇక ఇవాళ్టితో "సరి ! పూర్తిగా వెళ్లిపోయింది"—

భాస్కరానికి చెమటలు పోశాయి.

"ఛీ ! వెధవ బ్రతుకు ...." తిట్టుకున్నాడు—బెంచీమీద కూచుని ఆలోచించాడు.

"వాల్తేరు టెలిగ్రామిస్తే .... ?"

"ఉహూఁ .... ఎవరికిస్తాము ? ఏమని ?"

"పోనీ ! .... ఏం చెయ్యడం, నా కర్మ .... అసలు మనుషులమీద అంత అపనమ్మకం ఉన్న వాళ్లని అస్సలు నమ్మకూడదు. ఛీ. ఛీ. నేరక పోయి యీ పద్మతో స్నేహం చేశాను. అబ్బ ! ..." దుఃఖపడ్డాడు.

"ఉహూఁ .... లాభంలేదు .... పద్మావతికి నాలాంటివాడు సరిపోడు .... వూఁ .... వెళ్లనీ ఎవణ్నో ఏ గేదెపెయ్యలాంటి వాణ్నో కట్టుకుని సుఖపడమను .... అంతే .... కనీసం ఫిన్నైనా సంతోషిస్తుంది .... వెధవ జీవితం .... ఎవరో ఒకరు సుఖపడితే చాలు ...." పరిపరివిధాల బాధపడుతూ, కాళ్లీడ్చుకుంటూ, యివతలికి వచ్చాడు భాస్కరం.

గుండె రాయి చేసుకున్నా "ఒకవేళ కీడెంచి మేలెంచమ"న్నారన్న వ్యథ అతనిని పీడిస్తూనే ఉంది.

తన బాధ ఎవరికేనా చెప్పుకోవాలన్నా, చెప్పుకుని ఏడవాలన్నా కూడా — తన ప్రేమగాథ యావత్తూ ఒక అపరాధమే అయినట్టు దాచుకున్నాడు కద !

పద్మావతి తనను శంకించడం మాని దూరమాలోచిస్తే ఈ యిబ్బందులు, మానసిక వ్యథలూ, మనఃక్లేశమూ ఉండకపోను — కాని.....

భాస్కరం తిరిగి వెళ్లిపోవాలి ....తన చెల్లెలు పెళ్లి—వసంత పెళ్లి అయింది. కావి ఇంకా ఒక్క రోజేనా అవలేదు. పిన్నికి మహదానందంగా ఉంది. నాన్నగారికి ఘనంగా ఉంది. అందరికీ ఆనందంగా ఉంది. తనకీ ?

తనకు ఒక చెంపను దుఃఖం, ఇంకో చెంపను సంబరం—ఒకవేపు మిన్ను విరిగి మీద పడినట్టు మనసు క్రుంగిపోతూ ఉంటే—ఇంకోవేపు సంతోషంగా ఎదను ఉద్దేలంగా—తేలిపోతున్నట్టుగా ఉంది.

"తప్పదు—పద్మావతి వాళ్లమ్మ కోసరం నేరుగా ఇంటికే వెళ్తుంది" అనే ఆశతో తిరిగి 'విడిది'కి చేరుకున్నాడు భాస్కరం.

## 42

పద్మావతికి గుండెలు నిండిన దుఃఖం వచ్చింది. మనసును పట్టి పిండుతున్నట్టు బాధ కలిగింది. వెక్కివెక్కి ఏడవాలి ! కసిదీరా భాస్కరాన్ని సురేఖని, ప్రపంచాన్ని దేవుణ్ణి, అందర్నీ తిట్టాలి— ఏడవాలి .... కాని ఎక్కడ ? అందుకే నేరుగా స్టేషనుకి అనుకున్న తన గమ్యాన్ని బస్‌స్టాండ్‌కి మార్చుకుంది. రిక్షావాడు అడిగాడు కాస్త అనుమానంగా "ఏవూరు పోవాలిటండి ?"

"మా వూరే .... నువ్వు పోనీ !"

వీర్ని గట్టిగా కొట్టి బస్ స్టాండుకి తీసుకు వెళ్లాడు.

తిన్నగా గుంటూరు వెళ్లింది.

తన తాళాల గుత్తి చూసుకుంది.

ఇంటి తాళం చెవి తన దగ్గిర ఒకటి ఉన్నది .... గుంటూరులో నేరుగా అత్యవసరమైన పని ఉన్న దానిలా ఇంటికే వెళ్లి మెట్లు ఎక్కుతూఉంటే క్రింది ఇంట్లో అద్దెకున్నవాళ్లు చూశారు.

# ప్రేమకు పగ్గాలు

"ఏమమ్మా ! అమ్మ రాలేదా !" అని పలకరించిందామె.

"లేదండీ ! నేనే మా స్నేహితురాలి పెళ్లికి బెజవాడ వచ్చాను !" అని గబగబా పద్మావతి గది తెరుచుకుని లోపలికి వెళ్లిపోయింది.

కిటికీలు తెరవలేదు. ధూళి పట్టిన మంచం మీద, పేచు పరుపు మీదనే కుప్పలా కూలిపోయింది. సత్తువ తెచ్చుకుని లేచి తలుపు దగ్గరకు వెళ్లి గడియ వేసుకుని వచ్చి ప్రక్కమీద పడి వెక్కివెక్కి ఏడ్చింది. ఎన్నో సంవత్సరాలుగా దాచుకున్నదా? అన్నట్లు కన్నీళ్ల కట్టలు తెంచుకుని ప్రవహించాయి.

ఎంతసేపయిందో తెలియదు కాని లేచి కన్నీళ్లు తుడుచుకుంది. వెనుకవేపు కిటికీ తెరిచింది. అద్దం దుమ్ము అరచేత తుడిచింది. కళ్ళు వాచిపోయాయి. కన్నీటి చారికలు కట్టాయి మొహం మీద. మళ్లీ దుఃఖం పొర్లుకు వచ్చింది !

తను ఏం చేసింది ?

తను ఏం చెయ్యాలి ? ...

వెంటనే ఎవరో కొట్టి చెప్పినట్లు జ్ఞాపకం వచ్చింది ! "ఒకవేళ సురేఖ విశాఖపట్నం అమ్మకి ఉత్తరం వ్రాస్తే."

"అమ్మ నా గురించి బెంగపడితే ?" వెంటనే లేచింది. ఇవతలికి వచ్చింది. "ఇంటిగల చిన్నమ్మగారు ఒక్కర్తె వచ్చిందని తెలియగానే క్రింది యింటి పనిమనిషి వచ్చింది. నీళ్ళు పట్టుకుని వచ్చిందల్లా పద్మావతిని చూస్తూనే "మరి, మీ రెప్పుడు పప్పొ వొన్నం పెడ్తా రమ్మాయిగారూ!" అన్నది.

పద్మావతికి వొళ్ళు మండిపోయింది·!

'ఒదొక్కటే యీ బ్రతుక్కి తక్కువ' అన్నది విసుగ్గా.

పనిమనిషి చెప్పింది "మీ అన్నయ్యట ఒకబ్బాయి నిన్న మద్దెనేళ వొచ్చిపోయారు. దిగువింటావె. మీ చదువుకని వెళ్లినారని చెప్పింది."

"అరె ! అన్నయ్యా ?! అతను ఆవూరు వెళ్తానన్నాడా ?" పద్మావతి ఆందోళనకు పనిమనిషి ముందు విస్తుపోయింది. తర్వాత పద్మావతి ఉన్న వాలకాన్ని గమనించి ఏదో పసి కట్టినట్లు చూసి "అమ్మాయిగారూ ! మీరుగాని ఇంట్లో పోట్లాడలేదుగందా" అనడిగింది.

"ఏడ్చినట్లుంది !" విసుక్కుంది పద్మావతి. మళ్లీ ఏదో స్ఫురణకు వచ్చినట్లు ఆ పనిమనిషిని వెనక్కు పిలిచి ఒక అర్ధరూపాయి యిచ్చింది.

గబగబా స్నానంచేసి "అన్నయ్య ? మా అన్నయ్య ? మా కోసరమా ?"—అనుకుంటూ గబగబ ఎవరో తరుముతున్నట్లు దుస్తులు మార్చుకుని తిరిగి పెట్టె ఎలాఉన్న దలాగే మూతవేసి పట్టుకుని బయలుదేరింది.

"అమ్మ పాత కళ్లజోడు మరిచిపోయాను చిన్నమ్మగారూ ! వచ్చాను గదాని తీసుకెళ్తున్నాను" అన్నది దిగువింటావిడతో .... వెంటనే స్ఫురించిన అబద్ధం ఆడి.

ఆమె నాలుగూ అడిగి కాఫీ యిచ్చి "ఈ రాత్రికి యిక్కడ ఉండు అమ్మాయీ ! అక్కగారికి నే నుంచేశానంటే కోపంరాదూ" అన్నది ఆప్యాయంగా.

"లేదండీ ! పాఠాలు పోతాయి." అని రిక్షా ఎక్కి పోయింది పద్మావతి.

* * *

"అమ్మకి తెలుస్తే యీ గొడవంతా అమ్మ యిక తనను క్షమించదు" అన్న బాధతోనే రైలెక్కింది.

"పోనీ ! వెధవ బ్రతుకు ఇంత దగాపడ్డ

తర్వాత ఇక బ్రతికి ఏం లాభం ! చస్తే పోతుంది !''—

రైలు దడదడ పరుగెత్తుతున్నది. ఇక్కడ దూకేస్తే ? .... కాని,

దూకలేదు పద్మావతి.

తనను భాస్కరం దగాచేశాడని తెలియక తాను తల్లిని దగా చేసింది. ఇప్పుడా తల్లిని తన కోసరమే, —వూపిరి మాత్రం తీసుకుని తతిమా సర్వస్వాన్ని త్యాగం చేస్తూఉన్న అమ్మని వొదిలి ఇలా దిక్కుమాలిన చావు చావడం దారుణం అనిపించింది.

''దగా చేసినవాళ్లకి లేని బాధ నా కెందుకు ?'' అనుకుంది.

రైలు తన గుండెలమీద పరిగెడు తున్నట్లుంది. ఎంత కాదనుకున్నా పదేపదిగా ధనమ్మగారు 'ఈమె మా వియ్యంకురాలు' అని జానికమ్మగారిని చూపు తున్న దృశ్యమే స్ఫురణకు వస్తున్నది.

రైలు విశాఖపట్నం దగ్గరికి వెళ్లినకొద్దీ పద్మావతిని కోపం చల్లారి విరక్తి, నిర్లిప్తత ఆవహించసాగాయి !

''పోనీ ! ఆయన సురేఖతోనే సుఖపడితే అలాగే చెయ్యమను. నా కర్మ ఎలా ఉంటే అలాగే అవుతుంది. అమ్మ అంటున్నట్లు నేను పంతులమ్మగా బ్రతికి యీ జన్మకిదే చాలు ననుకుంటాను'' అనుకుంది.

''పాపం ! అమ్మ ఇంటిదగ్గర నా కోసరం ఎదురు చూస్తూ ఉంటుంది. తనకి తన ఆలోచన తప్ప మరొకటి ఉండదు కాని తనో ...... ఎప్పుడు భాస్కరం గురించే ఆలోచించేది ....''

''ఇక అక్కరలేదు'' విసురుగా బయటికి చూసింది వెనక్కి వెళ్తున్నట్లు అగుపించే ఆ చెట్లూ చేమల్లాగే తన గత జీవితం స్మృతులు కూడా భూతలంలోకి వెళ్లిపోతే బాగుణ్ను అనిపించింది.

కాని, భాస్కరం స్మృతులు తనను వెన్నాడటం మానలేదు.

పద్మావతికి తాను చాలా పెద్ద పొరబాటే చేశాననిపించింది. కాని ఇప్పుడు దానిని మరిచిపోవాలంటే సాధ్యంకావడంలేదు.

యాంత్రికంగా రైలు దిగింది. ఏదో అభూత శక్తి నడుపుతున్నట్లు ఇంటికి చేరుకుంది.

తలుపు తెరిచే ఉంది.

లోపల అడుగు పెడుతూనే ''అమ్మా !'' అన్నది. ఎదురుగా గదిలో గోడవార ఒక కొత్త పెట్టె హోల్డాలు ఉన్నాయి.

జయమ్మగారు కూతురు గొంతు వింటూనే ''వచ్చావా తల్లీ! వెయ్యేళ్లాయుష్షు'' అంటూ వంటయింటినుంచి ఇవతలికి వచ్చింది! ''నీ గురించే అనుకుంటున్నాము''—

''ఎవరమ్మా వచ్చారూ ?''

పెట్టె నక్కడ పడేసి మంచంమీద కూచుని భయం భయంగా అడిగింది పద్మావతి.

''మన రాజు .... అంటే మీ అన్నయ్య నిన్న నీ వేళకీ, అతగాడు వచ్చాడు ....'' అని చెబుతూనే ఆమె వంటయింటిలోనికి వెళ్లి కాఫీ కలుపుకుని వచ్చి కూతురి కిస్తూ ''అయ్యో ! అదేమిటే ఆ కళ్లు వాచిపోయాయి'' ఈడ్చి తన్నినట్లు, నీ వేషం—పిట్టలు పీకినట్లు ఆ జుట్టూ...'' అన్నది ఆశ్చర్యంగా.

''మరి ప్రయాణం గామ్మా'' అని కాఫీ త్రాగకుండానే అక్కడ పెడుతూ ''ఈ రాజు ఇప్పుడెందుకమ్మా వస్తు ?'' అన్నది అయిష్టంగా.

''తప్పు పద్మా ! అలా రాజు అనకు, అతగాడు బయటకు వెళ్లాడు. ఇప్పుడే వస్తాడు—విన్నాడా ? నొచ్చుకుంటాడు ....'' అని కూతురు దగ్గరిసా వచ్చి, ''రాజు గుంటూరు వచ్చి మనం యిక్కడ ఉన్నామని తెల్సుకుని వచ్చాడు. ఎంతైనా ఓ కడుపున కాకపోయినా ఒక తండ్రికి పుట్టిన వాళ్లు మీరు మీరు .... అన్నయ్య అన్నయ్యేనమ్మా! గౌరవించాలి'' అంటూ కూతురు తల నిమిరింది.

''అలవాటు లేదుగా'' అంటూ స్నానాల గదిలోకి వెళ్లిపోయింది పద్మావతి.

పద్మావతికి అద్దంలోకి చూసుకోగానే మళ్లీ దుఃఖం పొంగివస్తున్నది.

''ఇప్పుడీ అన్నయ్య ఎలా వచ్చాడు చెప్మా ?''

పద్మావతికి జ్ఞానం వచ్చిన తర్వాత రాజు అనే అన్నయ్యను చూడటం రెండు మూడు సార్లకన్నా ఎక్కువసార్లు జరగలేదు. వాస్తవానికి తన తల్లికీ, తండ్రివంక బంధువులకూ రాకపోకలు, తండ్రి మరణంతోనే ఇంచుమించు స్తంభించిపోయాయి.

పైగా రాజు తనకంటే పదేళ్లు కనీసం పెద్దవాడు ''పెద్దన్నయ్య''—అంచాత చూసిన రెండు మూడుసార్లేనా చనువు కూడా కలగలేదు.

పద్మావతి యువతలికి వచ్చేలోపున జయమ్మగారు—రాజుకి పీట, పళ్లెం అవీ అమర్చింది. ఆమెకు రాజు ఎందుకు వచ్చాడో తెలుసును. అదీగాక రాజు ఎలా వచ్చినా, ఎందుకు వచ్చినా, అది ఆమె దృష్టిలో తన ప్రతిపత్తికి, ఆత్మగౌరవానికి సంబంధించిన విషయం. 'పిన్నీ' అంటూ తన సవతి కొడుకులు రావడం—తన యోగక్షేమాలు కనుక్కోడం ఆమెకు ఒక ''కుల స్త్రీని'', ''సమాజంలో చాలినంత ప్రతిపత్తి గలదాన్ని'' అనే ఆత్మవిశ్వాసా న్నిస్తుంది.

పైగా ఇటీవల ఆమె పద్మావతికి భర్తవంక సంబంధా లేమేనా దొరకుతాయేమోనని ఆలోచిస్తున్న తరుణంలో రాజు రాక ఆమెకు ఎంతో నచ్చింది !

రాజు కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగం చేస్తున్నాడు—వయస్సు ముప్పై అయిదు ప్రాంతాలలో ఉన్నా నాజూకుగా ఉంటాడు. తండ్రిలాగే పొడగరి. పద్మావతిని చూస్తూనే ''ఏమ్మా ! అయిందా పీ్రెండు ఇంట్లో పెళ్లి ?'' అన్నాడు.

''అయింది'' తల దించుకునే చెప్పింది.

పిన్నీ ! పద్మావతి బాగా మారిపోయింది సుమా !—అంతా మా పార్వతి లాగే ....'' అని అంతలో ''మా'' అన్న మాట సర్దుకుని ... ''ఏం పద్మా ! నీకు అమ్మ నే తెచ్చిన ప్రెజెంట్ యివ్వలేదూ ?'' అన్నాడు.

''మా పార్వతి'' అన్న మాటలను జయమ్మగారు కూడా విననట్లే నటించింది.

పార్వతి రాజు చెల్లెలు. పద్మావతి కన్నా రెండేళ్లు చిన్నది.

''పార్వతిని తీసుకొని రావాల్సింది ....''

''అన్నయ్యా'' అన్న మాటను దిగమింగేస్తూ అడిగింది పద్మావతి.

''అదీ సరదాపడ్డది కాని నేనే అక్కయ్యా నే తెస్తాను అన్నాను సరేనా ?'' కూచుని తల వెనక్కి ఎగరేసి నవ్వాడు రాజు.

పద్మావతికి ఈ కొత్త అన్నయ్య రావడంవల్ల అనుకోని ప్రతివ్యాపకం దొరికింది—గుండె గాయాన్ని కాస్త ఏమార్చగలిగింది.

ఐతే ఇన్ని సంవత్సరాలుగా రాని అన్నయ్య ఇవాళ అకస్మాత్తుగా రావడం పద్మావతికి గుండెల్లో భయం భయంగా మెదిలింది. ఎందుకంటే, ''ఆస్తి మీద మీకు ఏ హక్కూ లేదన్న'' ధర్మనిధి యీ రాజు అన్నయ్యేనని ఆమెకు బాగా జ్ఞాపకం.

కాని, రాజు ఇప్పుడు వచ్చిన సంగతి వేరు. పెద్ద అన్నదమ్మునిగా తనకు గల బాధ్యతను నిర్వర్తించడానికి వచ్చానని జయమ్మగారికి రాజు






# ప్రేమ కుపగ్గాలు

చెప్పేడు అది తన హక్కు అని నమ్మడం జయమ్మగారి ఒకహీనత గనకనే రాజు యిరవై నాలుగ్గంటల్లోనే ఆమెకు చాలా సన్నిహితుడయ్యాడు

కూతురు పెళ్ళికి వెళ్ళి వచ్చిన వెంటనే ఎందుకని విషయం కదపలేదు గాని, ఆ రాత్రి ఎట్టకేలకు జయమ్మగారు పద్మావతితో రాజు ఆగమనంలోని అసలు కథ చెప్పింది

"పార్వతికి సమ్మంధాలు వస్తున్నాయట" అన్నదామె

"సరే! పెళ్ళి చేసెయ్యమను" అన్నది పద్మావతి.

"అదేం మాటలే! పెద్దదానివి నువ్వుండగా చిన్నపిల్ల దాని కెలా కళ్యాణం తలపెడతారూ? ఆమాట మీ పెద్దన్నయ్య రాజు అంటున్నాడు" జయమ్మగారు అసలు విషయం చెప్పింది

సమయానికి అందుకుని "మాడు చెల్లాయ్! నాకు నువ్వొకటే పార్వతీ ఒకటే కాదు ఆమాట కొస్తే మా అమ్మ మాట విని పార్వతిని బడి మానిపించి హైస్కూలు తర్వాత ఇంట్లో కూచోపెట్టానే గాని, నిన్ను ఇవాళ ఎమ్మే కుడా వద్దూ అనడంలేదూ" అన్నాడు

"పద్మావతికి నువ్వేవరివి?" అన్న మాటలు పైకి రాలేదు గాని పెదాల చివరిదాకా వచ్చాయి!

రాజు విషయం మరింత వివరించాడు

"పార్వతి అప్పుడే మూడేళ్లయింది పెద్దదై యింట కూచుని—నువ్వు ఆ బి ఏ అవగానే, పెళ్ళి సమ్మంధాలు చూద్దాము పిన్ని కబురు పెడుతుంది అనుకున్నాం—కాని, వెధవది కాలేజీలో రోజూ అరవడం, అలిసిపోవడం—తలమ్మకొన్న బ్రతుకు గదా . . అందుకని ఆ వెంటనే రాలేక పోయాను—ఇప్పుడు "

పద్మావతి అతి కష్టంమీద అతని వాగ్ధోరణికి అడ్డుపడి "కాని యీ చదువు పూర్తి చేస్తున్నయ్యా" అన్నది

"ఒప్పుండాను. నీ చదువుకు ఆటంకం రాగల కళ్యాణం ఎందుకు చేస్తాము నువ్వు నిక్షేపంలాగ చదువుకో .. పార్వతికి ఎలాగా మానేశాం " రాజు పార్వతి విషయంలో సొంత చెల్లెలైనందున అశ్రద్ధ చేశామన్నట్టు నిట్టూర్చాడు

జయమ్మగారన్నది "అయినా చిన్నవాళ్ళు వాళ్లతో ఏమిటి గాని నీవు ఏమైనా సమ్మంధాలు చూశావా? చెప్పు బాబూ!"

"లేదమ్మా! మొదట చెల్లాయినీ, నిన్నూ అడగాలి గదా! ఆమాటకొస్తే మన పలుకుబడికి కొదవలేదు గాని—మీరు యువతల ఏమీ సమ్మంధాలు వెతకడం లేదుగదా?" రాజు అడిగాడు

"లేదు, లేదు నీ పేరున ఉత్తరం రాయకుండా ఎలాగ? పెద్దవాడివి కదా?" నన్నది జయమ్మగారు ఆప్యాయంగా

ఆ రాత్రి మొత్తంమీద సమస్య ఎటూ తేలలేదు ముగ్గురూ తెగేవరకూ ఒకరిని ఒకరు సాధించగల ధైర్యంలేక పూరుకున్నారు

పద్మావతికి కంట కునుకు రాలేదు.

"ఇక భాస్కరానికి తనకూ అనుబంధం తెగినట్లేనా?" అన్న ఆలోచనయే ఆమె గుండెల్లో అగ్నిపర్వతమై పేలుతున్నది. (ఇంకా వుంది)

# ప్రధానం

21 వ పేజీ తరువాయి

తర్వాత వచ్చి కసాయి అంగడి దగ్గర వచ్చి కలుసుకోమంటుంది మే మిద్దరం చేతులు పట్టుకుని నడిచి వెళ్లిపోతాము ఆ ఇల్లు చేరుకుని చీకటిగా ఉన్న మెట్లు ఎక్కి వంటగది ప్రవేశిస్తాము. వంటగదిలో నాకు చూపించేందుకు ఏమిటి ఉంటుందా, అని నా ఆశ్చర్యం. మంచి 'కేక్' చూపిస్తుందా ? లేకపోతే, మరేదయినా వంటకం చూపిస్తుందా ? ఆమె ఒక తలుపు తెరిచి లోపలికి తోసి అవతల గడియవేసేస్తుంది

చుట్టూ చూస్తాను. ఎవరి పడకగదిలోనో ఉన్నాను. మధ్య ఒక పందిరి మంచం. దాని మీద కొన్ని దిళ్లు పక్కనే పాతకాలపు 'వాష్ బేసిన్'. బట్టల అలమార తలుపుమీద అద్దంలో కిటికీ పక్కనే ఉన్న వూగుడు కుర్చీలు కనుపిస్తాయి గది ఎంత ఖాళీగా అనిపిస్తోందో దానిని బట్టే తెలుసుకున్నాను కిటికీ దగ్గరికి వెళ్లి కింద వీధిలోకి తొంగిచూశాను మా స్నేహితురాలి ఇంట్లో లేను పక్క ఇంటి మేయర్‌గారి ఇంట్లో ఉన్నాను. రెండు ఇళ్లకీ మధ్య తలుపు ఉందన్న మాట కొంతసేపటికి మేయర్‌గారి భార్య లోపలికి విసవిస నడిచివస్తుంది పాలలో నానవేసిన రొట్టెలాగ మెత్తగా, లావుగా ఉంటుంది ఈవిడ ఏడ్పు ఆపమంటుంది మధ్యాహ్నం మా అమ్మ అక్కడికి వస్తుందిట అల్లం వేసిన టీ చేసి యిస్తుంది నాకు చూడటానికి ఈమె ఒక లావుపాటి 'క్యూపిడ్' (ప్రేమదేవుడు—బొద్దుగా ఉండే పిల్లవాడని సాంప్రదాయం—అ) లాగే ఉంటుంది నిజానికి కూడా అంతేగా మేయర్ ఇల్లు పారిపోయే ప్రేమికుల నిలయం వంటిది అక్కడికి వస్తే ఇక లేచిపోయిన దానికిందే లెక్క నేను, వంటరిగా వచ్చినా సరే !

రాత్రి మా అమ్మ వచ్చి పక్క గదిలో మేయర్ భార్యతో మాట్లాడటం వింటాను ఆవిడ—మేయర్ భార్య—మా అమ్మకి చెబుతోంది నన్నిక తీసుకువెళ్లి లాభం లేదుట, మా అమ్మ తన అప్పు తీర్చుకుంటోందిట, అంతే. ఈ అప్పు ఏమిటి ? అని నేను ఆశ్చర్యపడతాను మేము ఎక్కడా డబ్బు తీసుకోలేదే ? అప్పుడు మా అక్కయ్య విని నాకు చెప్పిన కథ ఒకటి గుర్తుకి వచ్చి చిరునవ్వు తెచ్చుకుంటాను. మా అమ్మ పెద్ద అందగత్తె కాబట్టి ఆమెని పెళ్లిచేసుకుందామని ఎందరో వచ్చేవారుట ఒక రైతు తన సంప్రదింపులు ప్రారంభించిన తర్వాత మా నాన్న వచ్చి మా అమ్మని తనూ వివాహం చేసుకుందామనే ప్రయత్నంలో పడపోతున్నానని చెప్పాడుట. ఆయన బడిపంతులు కాబట్టి ఆయనంటే అందరికీ ఎంతో గౌరవం. ఆయనకి ముందువారంతా అమెరికన్ ఉపాధ్యాయులే. అందుకని మరింత గౌరవం ! ఆయన నీరు పట్టి తీసుకొస్తాడా ! నేల కడుగుతాడా ! మా అమ్మ అతన్ని ప్రేమించేసింది ఇద్దరూ లేచిపోయారు అయితే పాపం, ఆ రైతు అప్పటికే 98 కొబ్బరిచెట్లు నాటడం పూర్తిచేశాడు

ఆ రాత్రి మధ్యవర్తులు కొందరు మా నాన్న యింటికి వెళ్లి రెండు రోజులు సంప్రదించారు—చివరికి వాళు వచ్చిన నిర్ణయం ఏమిటంటే, పెళ్లి పై ఆదివారం జరపాలని. మీ కుటుంబం మాకు 501 "పెసో" (ఒక రకమయిన నాణెం) లు ఇవ్వాలి (1 పెసో కొవ్వు ఎతి కి.) మనకి మానాన్న 700 చెట్లు ఉన్న కొబ్బరితోట ఇచ్చేస్తాడు మీ నాన్న దీనిలో సగం వైశాల్యం కల వరిచేను ఇస్తాడు మా అమ్మ ఒక పెద్ద సీమపంది ఇస్తుంది మీ అమ్మ రెండు 'కారబో' లు, ఒక ఆడ మేక ఇవ్వాలి. మీ తాత మన కొక కొత్త ఎద్దుబండి (రబ్బరు టయర్లతో సహా) ఇవ్వాలి. కాని మా తాత చనిపోయి చాలా కాలం అయింది కాబట్టి ఆయన ఏమి ఇవ్వగలడు ? మూడు రోజుల తర్వాత మేయర్ ఇల్లు వదిలి వస్తాను. నా తిండి ఖర్చులు ఇస్తానంటుంది మా అమ్మ, కాని మేయర్ భార్య వప్పుకోదు. సరే, ఆమెని ఒక పెళ్లి పెద్ద చెయ్యి నిశ్చయిస్తాము పెళ్లి కాథలిక్ చర్చిలో, విందు మీ ఇంట్లో, కర్చులవీ మీవేగా ?

ఇంతలో చాలాపని ఉందికదా ! నా పెళ్లి బట్టలు తయారు కావాలి. మా ఇంటి సావిడిలో మరొక భోజనాలగది వేస్తున్నారని మా అక్క చెల్లెళ్లందరూ చెప్పారు నాకు వెదురు, కొబ్బరిఆకు విరివిగా వాడుతున్నారుట. పందులు, మేకలు, కోడిపెట్టలు విపరీతంగా కోస్తున్నారుట వెనక స్థలం అంతా ఒక పెద్ద వంటగది అయిపోయిందిట అతిథులు ఎందరు వస్తారో ! చుట్టాలే ఉన్నారు! ఆహ్వానం లేకపోతేనేం ? నోటిమాట వింటే చాలు గదా ! రావటం తమ ధర్మం అనుకుంటారు అందరూ భోజనాలలో రెండు బంతులు. కత్తి, ఫోర్కు వాడడం వచ్చేవారికి ఒకటి ఇవి రానివారందరికీ ఒకటి మనిద్దరం ఇక మాట్లాడుకోవచ్చు. అంతులేకుండా ఒకరిని గురించి ఒకరు చెప్పుకుంటామ కాని, ఒకరి నొకరు ముట్టుకోటానికి మాత్రం వీలులేదు—మా కుటుంబంవారు ఇది గమనిస్తూ ఉంటారు.

వారం తిరిగి ఆదివారం రానే వచ్చింది మీ ఇంట్లో కన్ను తెరుస్తాను. ముందు రాత్రి మా అక్క చెల్లెళ్లతో, మరదులతో, వదినెతో వచ్చి మీ యింట్లో వచ్చి పడుకున్నాను అద్దం ముందు పెళ్లిబట్టలలో నుంచున్న నా వెనకాలే వస్తావు నువ్వు వచ్చి ముద్దు పెట్టుకుంటావు 'తప్పు ! తప్పు !' అని అరుస్తారు మావారందరూ ఇంక పరవాలే దనుకుంటాను రోజంతా ఇలాగే హాయిగా ఉంటుంది. నా తెల్ల చెప్పులు వేసుకున్నానో లేదో సంగీతం 'బాండ్' వచ్చి చర్చికి తీసుకుపోతారు. ఈ బాండ్‌వాళ్లు గట్టిగా వాయించివేస్తున్నారు మన పెళ్లికేం తక్కువ ? చర్చికి నడిచి వెళ్లుతూఉంటే—నేనేమో నా పెళ్లి దుస్తులు బురద అంటకుండా జాగ్రత్తగా ఎత్తి పట్టుకుని నడుస్తూ ఉంటే, నువ్వు, నేను నీటిలో కాలు పడకుండా నా రెక్క పట్టుకుని తీసుకు వెడుతుంటే—వీధికి ఇరువైపులా ఉండే ఇళ్ల కిటికీల నిండా వింత చూసేవారి మొహాలే కదా ! అతిథులందరూ మనతోబాటే నడుస్తారు. అందరం చర్చి ద్వారం చేరుకుంటాము.

ఒక పెద్దమనిషి వచ్చి పెత్తనం బాధ్యతలు వహిస్తాడు—పాట, మైనపు వత్తులు, తాడు, అన్నీ! ఫాదరీ చాలా ముసలివాడు. 'మాస్' చెప్పటానికి ఎంతోసేపు పడుతుంది చర్చిలో చలిగా ఉంటుంది గోడలనిండా తేమ, పైన తలకిందులుగా వేలాడు

తున్న గబ్బిలాలు, ఈ రంగు రంగుల దుస్తులు వేసుకుని, కరుస్తున్న కొత్త చెప్పులు తొడుక్కుని వచ్చిన ఈ మూక ఎవరా అని చూస్తూ ఉంటాయి అంతా అయిన తర్వాత నీ పాదం నిర్దాక్షిణ్యంగా వచ్చి నా పాదంమీద నొక్కుతుంది నేను కూర్చున్న కుర్చీలోంచి లేపలేను - బాధతో అరుస్తాను ఇలా చెయ్యమని నీకు చెప్పారు,

# ప్రధానం

ఇంట్లో ఎవరు యజమానో ఇప్పుడే తెలిసేందుకుట.

మీ ఇంటికి నడిచి వెడతాము, అతిథి బృందం, 'బాండ్' తో సహా ఒక పెద్ద బల్ల దగ్గిర ప్రథమ స్థానాలు మనకే ఫలహారం మొదలుపెడతాము మన వైవాహిక జీవితం తియ్యగా ఉండాలని సూచించేందుకు నువ్వు నా నోట్లో ఒక చక్కెర బిళ్ల పెడతావు తక్కినవారు అందరూ భోజనాలు కానిచ్చేస్తున్నారు తర్వాత మనం అక్కడ పోగయిన పెద్దవారందరి చేతులూ ముద్దుపెట్టుకుంటాము ఒక్కొక్కరికీ ఒక 'గాహాన్' పాత్ర ఇస్తాము

పెత్తనాలు చేసే పెద్దమనిషి, ఒక గిటార్

వక్క వాద్యంతో పాట పాడుతాడు. నేను మీ చుట్టా లందరినీ చూసివస్తాను నువ్వు మా చుట్టాలందరినీ చూసి వస్తావు మీ పెదనాన్న దగ్గర నాట్యంచేసూ ఆయనకి ఒక పాత్ర కాను కగా ఇస్తాను. నన్ను ఏడిపించటానికని ఆయన దానిలో ఒక పెసో మాత్రం వేస్తాడు తర్వాత నా నాట్య నైపుణ్యం చూసి ఉన్న డబ్బంతా అందులో కుమ్మరిస్తాడు. జేబులన్నీ ఖాళీ అని చూపిస్తాడు. నా కృతజ్ఞత చూపేందుకు నా 'కప్పు' లోనుంచి 'వైన్' తాగనిస్తాను. నా పెదవులకి కూడా కప్పు ఆనిస్తాను కాని తాగకుండా పెదవులు మాత్రం తడి చేస్తాను

కాని నువ్వో! పిచ్చి పెళ్లికొడుకువి, పెదవి తడుపుకుని వూరుకోకుండా కొన్ని గుక్కలు తాగు తావు దానితో నీ ధోరణి మారిపోతుంది గట్టిగా మాట్లాడుతూ ఎగిరెగిరిపడుతూ ఉంటావు. మా చుట్టా లందరికీ నువ్వంటే ఇష్టం! నీ తట్ట నిండా డబ్బే!

అందరిముందూ నాట్యం చేశాము ఇద్దరి పాత్రల ధనమూ లెక్కపెడతాము, ఎవరిదాంట్లో ఎక్కువో, అని నీవంతు డబ్బంతా మూటగట్టి నాకు ఇస్తావు ఇది నీ ఆర్జనలో మొదటి వాయిదా! ఫిలిపినో గృహంలో డబ్బుమీద అధికారం అంతా భార్యదే

అందరూ ఆహారంతో, మద్యంతో నిండి నవ్వుతూ, కథలు చెపుతున్నారు. చివరికి 'పార్టీ' అయిపోతుంది ఎంత చిందర వందర! నీ మొహం ఎర్రబడి చెమటలు కక్కుతుంది. గలహన్ తాగి నీ మెదడు పనిచెయ్యడంలేదు. మెట్లు ఎక్కించి తడి తువ్వాలుతో నీ ముఖం కడిగి టీ చేసి ఇస్తాను. టీలో తాగుడుకి విరుగుడు ధాన్యం కొన్ని వేస్తాను

నా పెళ్లి బట్టలు విప్పి పాతవి తొడుక్కుంటాను కిరసనాయిలు దీపం వత్తి పెద్దది చేస్తాను. —అప్పటికే బాగా చీకటిగా ఉంది. మీవారందరూ కింద బావిదగ్గర అంట్లు తోముతున్నారు నేను గదిలో పళ్ళేలు తీసి కడగటం మొదలుపెట్టాను. ఇంటి కోడలు బద్ధకస్తురాలనే అపవాదు రాకూడదు కదా! నువ్వో —పెళ్లికొడుకువి, వెదురు మంచంమీద ఉన్నావు. నా ఆస్తివి, నా సంతోషానికి విశ్రాంతికి, శాంతికి, మాధుర్యానికి మూలకారణానివి .... కాని, మన పెళ్లినాటి రాత్రి తాగి పడిపోయి నిద్రలో మునిగి ఉన్నావు! 

# "హారి పిడుగుల్లారా!!!

17 వ పేజీ తరువాయి

మంచి నీళ్ళు త్రాగొచ్చేసరికి మా రాధ కూడ వచ్చేసింది.

ఇద్దరం బయల్దేరి పంచలో కొచ్చాం ఆ గేటు దగ్గర చెట్టు చాటుగా పొంచి ఉంది ఏమిటబ్బా? .... హత విధి! ఇది కూడానా? .. .. నా కాళ్ళు చల్ల బడ్డాయి! కానీ— పరికించి చూద్దునుగదా అది పిల్లికాదు! కాగితం! "నిర్విఘ్నం కురుమేదేవ సర్వ కార్యేషు సర్వదా" గణపతిని ధ్యానం చేసుకున్నాను. జరగవల్సిన కార్యక్రమం తల్చుకుంటే గుండెల్లో రైళ్ళు పరుగెత్తుతున్నయి బాబోయ్! పెద్ద పులిలో దాగుడు మూతలు! .... వెళ్లి రిక్షా పిలవడానికి వెళ్ళేసరికి ఎక్కడలేని భయం వేసింది మనసు ముందుకు లాగుతుంటే కాళ్ళు వెనక్కు గుంజుతున్నాయి ఎందు కొచ్చిన బాధ! వూరుకుంటేసరి అనుకోని అడుగు వెనక్కు వెయ్యబొయ్యాను. 'దేవదాసు', 'లైలామజ్నూ' లాంటి ప్రసిద్ధ ప్రేమాయణ గాథలన్నీ కళ్ళ ముందు తిష్ఠ వేసేసరికి నా పిరికితనాన్ని తిట్టుకుంటూ, చెదిరిపోయిన ధైర్యాన్ని కూడగట్టుకుని రిక్షా ఎక్కాను.

ఇల్లు దగ్గరవుతున్నకొద్దీ గుండె కొట్టుకునే వేగం హెచ్చుతోంది. అంతకూ నా ఎరికలోవున్న దేముళ్ళందరనూ పేరు పేరునా పిల్చి మొక్కుకున్నాను చెప్పొద్దూ ఆ క్షణాన నాకు లక్ష్మి మీదనే కోపం వచ్చింది! అవతల కొండల్లే అంత పెద్ద బామ్మగారు ఉంటే ఆవిడను అడగకుండా ఇది గోపిని మరీ అంత ఇదిగా ప్రేమించెయ్యటమేంటి? వేరే సంబంధంచేస్తే చస్తానని బెదిరింపు! లక్ష్మి కళ్ళబడితేనా పచ్చడి చేసేద్దును ఆలోచనల్లోనే వచ్చేసింది ఇల్లు అయినా ఈ రిక్షా వాళ్ళు గూడ ఇంతే! రైలుకు వేళవుతోందంటే రాజహంసల్లా పోనిస్తారు రిక్షాని ఇలాంటప్పుడు కొంపలంటుకు పోతున్నట్లు పరుగులు! రిక్షా దిగుతుంటే నా ముఖం చూడాలి జీరో వాట్ బల్బు ఎక్కువ కాంతివంతంగా ఉంటుంది! నిలువెల్లా వణుకు, చెమటలు చలి జ్వరం పేషెంటులా ఉన్నానంటే నమ్మండి

తలుపుతడూ "బామ్మగారూ!" అనబోయి మళ్ళీ సర్దుకుని, "లక్ష్మీ! . " అని పిల్చాను "ఎవరూ? ... ." అంటూ వచ్చి తలుపు తీసిన బామ్మగారు నన్ను చూసి "అయ్యో పిచ్చితల్లి! రిక్షాలో వచ్చినా వడదెబ్బ కొట్టింది. ఇట్టా కూచో ఇప్పుడే ఓ చుక్క మజ్జిగిస్తా"నంటూ వెళ్ళింది. బామ్మగా రిచ్చిన చిక్కటి మజ్జిగ గ్లాసు త్రాగాక ప్రాణం కొంచెం తేరుకుని "లక్ష్మి ఏది బామ్మగారూ!" అన్నాను చాలా నీరసంగా.

"లక్ష్మి లేదమ్మా అరుణవచ్చి పిల్చు కెళ్ళింది ఈపాటికి వచ్చేస్తుండాలి. ఒక్క నిముషం కూచో" అంటూ చాప వెయ్యబోతున్న బామ్మగారితో "లోపల ఉక్కగా ఉందండీ. అలా పంచలో కూచుందాం పదండి" అంటూ పంచలో కొచ్చి కూర్చున్నాను బామ్మగారు కూడ చేటలో బియ్యం పోసుకువచ్చి కూచుంది. నేనూ సాయం చేస్తున్నాన. ఇంతలో "అక్కయ్యా! మొల్ల పూలే! " వాకిట్లో మొల్ల పందిరి చూపిస్తూ అంది నేను కళ్ళతోనే కసురుతుండగా బామ్మగారు ఎప్పుడు పసి కట్టిందో "వెళ్ళి కోసుకోమ్మా" అని చెల్లికి చెప్పి "ఆడపిల్లలకు పూలమీద ఆశ ఉండదా? . ." అంటూ నన్ను మందలించింది. బామ్మగారు మంచి 'మూడ్' లోనే ఉంది శుభ సూచకమే అనుకున్నాను

బామ్మగారు బియ్యం ఏరుతూనే "మా లక్ష్మికి పెళ్ళే అమ్మాయి" అంది

ఒక్కమాటు గుండె గతుక్కుమన్నా కనబడనీకుండా నవ్వుతూ "ఓహో! ఎప్పుడండీ! ..." అన్నాను ఫర్వాలేదు నాకూ నటించడం వచ్చునని సంతృప్తి పడుతూ.

"ఇంకా ముహూర్తాలు పెట్టుకోలేదుగానీ— తొందర్లోనే . ..."

"ఏ వూరిస్తున్నారు? . .." ఎరగనట్టే అడిగాను

"వాళ్ళ మేనత్త కొడుక్కేనమ్మా. తెనాలి దగ్గరే " బామ్మగారు వాళ్ళ ఆస్థి తాలూకూ వివరాలు అవీ చెప్పుకు పోతోంది తలొంచుకుని నా కళ్ళు మాత్రం గేటు మీదనే ఉన్నాయి అర గంట గడిచింది

ఇంతలో మెల్లిగా గేటు తెరుచుకుని లోపల కొచ్చిందో సోదమ్మి. "సోది చెప్పించుకుంటా రమ్మా?" అంటూ. బామ్మగారు ఉలిక్కిపడి తలెత్తి, "ఇప్పుడేం వద్దు వెళ్ళమ్మా" అంది.

"గాలుందా, దెయ్యముందా, దోసముందా. .. ఉన్నదున్నట్లు, లేంది లేనట్టు సెబుతా. జరిగేది జరగబొయేది అద్దంలో సూసినట్టు సెబుతా తల్లీ" అంటూ గంప దించుకు మెట్లమీద కూచుంటూ చెప్పుకుపోతోంది సోదిమనిషి.

"నీకేకదూ చెప్పడం? వెళ్ళు వెళ్ళు" బామ్మగారు ఉరిమి చూసింది. లావుపాటి కళ్ళద్దాలలో నుండి బామ్మగారి కళ్ళు ప్రత్తి కాయల్లా కన్పించాయి. అయినా—ఆ కళ్ళను ఖాతరు చెయ్యకుండానే "ధరమ తల్లివి . ఈడనే గంప దించినా సేతిమీదుగా బోణీ సెయితల్లి పేరు సెప్పుకుంటా. గుప్పెడు బియ్యం. అంత పచ్చడెట్టినా సాలు తల్లి .. గుప్పెడు బియ్యం మేగా?....." కూచున్న చోటునుంచి కదలకుండా చెప్పుకుపోతుంది

"ఏయ్ అమ్మి! బియ్యానికి మొహం చూసుకొంటామనుకున్నావా? ఏంటా మాటలు?..... అంటూ దాన్ని కసిరి, "అబ్బబ్బ! వీళ్ళు మొండి మనుషులండీ . .పట్టుకుంటే వదలరు.. .." అన్నాను ఇహ మీకు తప్పదు కానీండి అన్నట్లు చూస్తూ, "మా అమ్మకూ ఇలాంటివంటే మహా నమ్మకం......" అన్నాను నా కక్కడ నమ్మకం లేనట్లు!

బామ్మగారు ఏమనుకుందో ఏమో రెండు దోసిళ్ళ బియ్యం చాటలో పోసి, దాని ముందు కూచుంది ఓ మాటు నెత్తిమీది కొంగు సవరించుకుని ఆ అమ్మి కళ్ళు మూసుకు ధ్యానం చెయ్యడం ఎదురుగ్గా శ్రద్ధా భక్తులతో కూచున్న బామ్మగార్ని చూస్తే నాకు నవ్వాగలేదు.

"జయమ్మ! దేవతను ధానిత్తుంటే నవ్వుతవేటమ్మా . ." సోదమ్మి కోపగించుకుంది.

"తప్పమ్మా, నవ్వకూడదు. ఆ ధ్యానమే వాళ్ళకు వాక్కు నిస్తుంది" అంటూ బామ్మగారు నాకు హిత బోధ చేసింది ఇదీ మంచి ఎఫెక్టే ఇచ్చింది లెమ్మనుకుంటూ తలవంచుకు బియ్యం ఏరడం మొదలెట్టాను సగం నవ్వాపుకోడానికి, సగం నాకేమీ పట్టనట్టుండటానికీ . .... "పెద్ద పులి పుటకే తల్లే . ..సేతికెముకలేదు మాటకు తిరుగులేదు పెట్టి పుట్టిన తల్లివోయమ్మ......" ఇలా చెప్పుకు పోతోంది.

(ఇంకా ఉంది)

మీ కృపియే దేశానికి సౌభాగ్యం
మీ పొదుపే రక్షణనిధికి మదుపు

## లాభదాయకమైన లఘు పరిశ్రమ ప్రారంభించండి

"అధునాతన కుటీర పరిశ్రమలు" (తెలుగు) పుస్తకంలో లాభదాయకమైన వివిధ పరిశ్రమలు వున్నాయి. ఈ పరిశ్రమలలో వున్నవారు చక్కటి లాభాలను ఆర్జిస్తున్నారు ప్రతి పరిశ్రమను గూర్చి సంక్షిప్తమైన వివరాలు, ముడి పదార్థాలు లభించే చోట్లు, ముడి పదార్థాల కొనగోలుకు, వాయిదాల పద్ధతిన యంత్రాల కొనగోలుకు ప్రభుత్వం యిచ్చే సహాయం – ఇందులో వున్నాయి. లఘు పరిశ్రమలు ప్రారంభించదలచుకున్న వ్యక్తుల సమస్యలకు తగిన పరిష్కారమార్గాలు యిందులో వున్నాయి పుటలు 878, సుమారు 300 బొమ్మలు, ధర రూ. 13, తపాలా రుసుము రూ. 1-61 Phone 229835

**COTTAGE INDUSTRY, (WN-60), P.B. 1262, Jamuna Road, Delhi-6.**

PTM

PARAGON FABRICS

PARAGON

పారగాన్ టెక్స్టయిల్ మిల్స్

EVEREST

## నెర్వొటాల్

నరములు బలహీనతకునూ ... పోవుచున్నా రామబాణము అనుభవ యుక్తముగా చేయబడినది

8 ఔ. సీసా 5-75, పోస్టేజి 1-75

**ఇండియన్ మెడిసన్ హౌస్, విజయవాడ-2.**

### పుస్తకము

మీకు సుఖమైన జీవితం గడపాలని ఉందా? కామ విషయాలలో ఉన్నతమైనవి తెలుసుకోవాలని ఆతురతపడుచున్నారా? మీరు ఆరోగ్య దాంపత్యాన్ని వాంఛిస్తారా? అయితే, మీరు చక్కని మార్గదర్శకమైన ఈ గ్రంథాన్ని తప్పక చదివి తీరాలి సుప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి సీతాలక్ష్మి రచించిన **'సుఖజీవిత రహస్యాలు'** 18సం॥ పైబడినవారికే ఈ పుస్తకం విక్రయం. గర్భనిరోధం, సుఖవ్యాధుల నివారణోపాయాలు స్వర్గసుఖాలను అనుభవించడానికి మార్గాలు– ఇత్యాది ఎన్నో విషయాలు తెలియజేసే పుస్తకం (బొమ్మలతో) వెల: రు 2-25 (తపాల ఖర్చులతో) ఉత్తరాలు ఇంగ్లీషులోనే రాయండి.

కాపీలకు **మాధవి నిలయం,**
154, ఆళ్వార్పేట స్ట్రీట్, మద్రాసు—18

## వైబ్రో

గర్భాశయ రోగ నివారిణి

సర్వ గర్భాశయ వ్యాధులను పోగొట్టి, ఆరోగ్యవంతుల సంతానము కలుగజేయును. అన్నిచోట్ల దొరకును. సీసా 2-8-0

కృష్ణా లేబరేటరి బెజవాడ

నిర్భయంగా, ధైర్యంగానూ చట్ట సమ్మతమైనదీ, న్యాయమైనదాన్ని సమర్థిస్తూ, ఆంధ్రుల సమంజసమైన కోరికలకు తగు రూపురేఖలు ఇవ్వగలరని ఆశిద్దాం.

## బంధవిముక్తి

నిర్బంధ పొదుపుచట్టం నుంచి అనేకవేల ప్రాణులు విముక్తులయ్యారు. వచ్చిన రాబడితో ఖర్చుల దొంతర్లను సర్దుకోలేక విహ్వలులైపోతున్న ఉద్యోగస్థులు ముఖ్యంగా కొంచెం దాచిపెట్టాలంటే, దారుణమైన బాధగానే పరిణమించింది. మొరార్జీదేశాయి ధర్మమా అంటూ అందరికీ ఈ శిక్ష విధించబడింది. బ్రహ్మాస్త్రం ఉపయోగించినట్లు పండిట్ నెహ్రూ కామరాజ్ పథకం క్రింద, దేశ కంటకులుగా పరిణమించిన కొందరి మంత్రివర్యులను పదవుల్నుంచి తొలగించి, గొప్ప మేలు చేశారు. మంత్రిపోయినా, వారు అమలు పెట్టిన పథకాలు అట్లాగే ఉంటాయని మొదట్లో మొండివాదన చేసినా, ఆచార్యులవారు ఆర్థిక మంత్రిత్వశాఖ చేపట్టిన తర్వాత, ఇట్టే మార్పులు తీసుకువచ్చారు. తొలగిన మంత్రిని తలెత్తుకోకుండా చేశారు. దీనికి ఆయన్ను అభినందించాల్సిందే ! సచివాలయపు ఉద్యోగస్థులు ఇతర శాఖల, గుమాస్తాలు, ప్రయివేటు రంగంలో సేవచేస్తున్న ప్రముఖులు, కార్మికులు, స్వయం వృత్తులవారు ఒకరేమిటి అందరూ

# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

కూడా అమ్మయ్య అంటూ పెద్ద నిట్టూర్పు విడిచారు. ఈ పొదుపు చట్టం తీక్షణత తట్టుకోవటానికి, చాలమంది జీవిత భీమా చేసి కూర్చున్నారు. ఒక విధంగా చూస్తే, నిర్బంధపు జీవిత భీమాగా తయారయింది. దీంట్లో కాస్త ఆత్మ సంతృప్తి ఉంది. ఇప్పుడు కొత్త సవరణల ప్రకారం, కేవలం, రాబడిపన్ను చెల్లించగల స్తోమత గలవారికే ఈ పొదుపు చట్టం కూడా వర్తిస్తుందన్నారు. దీనివలన సామాన్య ప్రజలు బాధపడరు. రాబడిపన్ను చెల్లించగల ఆదాయమే వస్తూ ఉంటే, కాస్త పొదుపు చెయ్యడంవలన వచ్చిన ప్రమాదమేమీలేదు. అసలు ఈ చట్టాన్ని మొత్తం తీసెయ్యకుండా, ఈమాదిరిగా సవరణ చెయ్యటంలో చూపెట్టిన నేర్పుకూడా ప్రశంసనీయమే !

ఇక పోతే బంగారం విషయం ఉంది. బంగారం నియామాలను కూడా సవరించటం జరిగినా, ఆశించిన రీతిగా భారీ ఎత్తున మార్పులు రాకపోవటం నిరాశగానే ఉంది. 14 వన్నెలకు మించి ఉన్న ఆభరణాలను, మళ్ళీ అదేవన్నెలో ఇంకో రకమైన ఆభరణాలు చెయ్యటానికి, స్వయం వృత్తులు చేస్తున్న బంగారపు పనివారలకు అవకాశం కల్పించారు. ప్రభుత్వంవారు, వీరికి తగిన లైసెన్సులు కూడా ఇస్తారుట. దీనివలన బంగారపు పనివారలకు ఒకవిధంగా ఉపాధి కల్పించబడినట్లే భావింపబడుతోంది. అయితే దీనికి ముందుగా జంటనగరాల్లో, నిరుద్యోగ సమస్యకు గురి అయిన, బంగారపు పనివారలకు ఉపాధి కలిపించే నిమిత్తం, ఓ కమిటీని వేశారు. దానికి, రాష్ట్ర, కేంద్రప్రభుత్వాలు తగు సహాయం కూడా చేశారు. కాని ఆ కమిటీ నిద్రపోతోందిట ! గత ఎనిమిది నెలలో కూడా ఒక పనివారికి సహాయం చేసిన పాపానపోలేదుట! కొత్తగా శిక్షణ కేంద్రాన్ని స్థాపించాలని కూడా ఉందిట. అలాంటిదేమీ ప్రారంభించలేదు. ఇలాంటి పనులను, ఈ కమిటీ వారికి అప్పచెప్పొంగదా, అని, రాష్ట్ర ప్రభుత్వంవారు ఉపేక్ష వహించారుట ! దీనివలన జరగాలసిన సహాయం జరగకపోగా, తీవ్రమైన అసంతృప్తి, నిరుత్సాహం ప్రబలిపోయినాయి. కొంతవరకు ఈ నియమాల సవరణ జరిగినా, బంగారపు పనివారలకు జరిగిన ఘోరమైన అన్యాయాల్ని దృష్టిలో పెట్టుకుని, వాళ్ళ ఉపాధికి తగిన సౌకర్యాలు కల్పించటమే గాకుండా, ముందుముందు వాళ్ళ వృత్తి నిరాఘాటంగా సాగిపోవటానికి తగిన చర్యలు తీసుకోవటం కూడా అవసరమే !

—ఐ. ఎల్. ఎన్. ★

శ్రీయుతులు హరికృష్ణ మెహతాబ్, మహావీర త్యాగి, హనుమంతయ్య, రఘునాధసింగ్. ఉపనాయక పదవిని శ్రీ మెహతాబ్ దాసప్పకు పోవటమే గాక, శ్రీ దాసప్ప రైల్వేల మంత్రి అయ్యారు. హనుమంతయ్యను క్రమశిక్షణచర్య తీసుకుంటామని బెదిరించారు. ఇంకొక ఇద్దరిని అభిశంసించటం జరిగింది. మొత్తంమీద రంగమే మారిపోయింది. దేశాయ్, పాటిల్, జగజీవనరాంలను మంత్రివర్గంలోనించి తొలగించటం కొంత స్పర్థలకు కారణమైంది. పాటిల్ మున్నటిన్న పాములా పడిఉండడం విషయం ఆయన కలకత్తాలో చేసిన ప్రసంగంవల్ల స్పష్టమైంది. కమ్యూనిస్టుల వారి మిత్రుల వ్యతిరేక ప్రచారం ధర్మాన మొరార్జీ దేశాయ్ గుజరాత్‌లో తిరిగి పలుకుబడిని సంపాదించుకున్నారు గనుక తిరిగి తన స్థానాన్ని బలపరుచుకోటంలో సందేహంలేదు. ఇంక వెనుకబడిన జాతులకు ప్రతిబింబం శ్రీ జగజీవనరాం. ఈ ముగ్గురికి పరిపాలనలో కిటుకులు చాలా బాగా తెలుసు గనుక, ప్రధాని కాస్త ఇరకాటంలోనే పడేస్తూంటారు.

పార్లమెంటుకు రామమనోహర లోహియా రావటం కొంత ముఖ్యమైన విషయమే. చిన్న ఆయన లోకసభలోకి ప్రవేశించేశారు. ఈయన వచ్చి ప్రణాళికాసంఘాన్ని ఉక్కిరిబిక్కిరి చేశారు. చాలా పాతకాలం వాడనేది కాకపోతే శ్రీ హేమ్‌బారువా మంచి వక్తే గాక ప్రశ్నోత్తర సమయంలో మంచి ప్రాధాన్యాన్ని పొంది ఉండేవాడు. ఆరోగ్యం గనుక సరిగా లేకపోయినా శ్రీ నాథ్ పాయి పార్టీ నాయకుడు ఉనిపించుకున్నారు. స్వతంత్ర సభ్యులలో ఫ్రెంక్ ఆంథోనీదే పైచెయ్యి అయింది. చర్చల్లో రెండుసార్లు ముఖ్యంగా

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

నేఫా విషయాలమీద చర్చల్లో ఆయన వాగ్ధాటితో అందర్నీ అధిగమించిపోయారు. కాంగ్రెస్ సభ్యురాలు శ్రీమతి శారదా ముఖర్జీ చర్చలో అసాధారణమైన ధైర్యం చూపించారు.

నేఫా చర్చల సందర్భంలో ప్రభుత్వం ప్రజల పట్ల, పార్లమెంటు పట్ల నిరాదరణ చూపించిందనే అనాల్సి వస్తోంది. ఈ చర్చను సమావేశం చివరి దశలో ప్రారంభించారు. ఇక లోకసభలో ఏదో ఓ మూడు రోజులపాటు కళ్ళ నీళ్ళు తుడిచినట్లు చర్చలు జరిపారు. ఈ చర్చను ప్రచురించాల్సినంతటి ప్రముఖ ప్రసంగాలే లేవని ప్రభుత్వం అనుకుంది.

అభిశంసనతీర్మానాన్ని పాటించటానికి నేఫా నివేదికమీద చర్చ నోరు మూయించటానికి ప్రభుత్వానికి ముంచెత్తే సంఖ్యాబలం ఉన్నా ఈ రెండు విషయాల్లోనూ అనుసరిస్తున్నంత ఆర్భాటం కనబడడమే లేదు.

**గత అక్టోబర్‌లో చైనీయుల దురాక్రమణ ఎదుర్కొనే విషయంలో అసన్నద్ధంగా ఉండటానికి కారణమేమిటో ప్రభుత్వం వివరించనేలేదు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత చరిత్రలో మొట్టమొదటగా ప్రధానిని వేలెత్తి** చూపి వివరాలు అడగాల్సి వచ్చింది.

ప్రభుత్వంమీద అందులోనూ ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ, కృష్ణమీనన్‌లమీద వచ్చిన ఆరోపణలలో ఏ ఒక్కదాన్ని మన రక్షణ మంత్రి శ్రీ చవన్ ఖండించగల స్థితిలో లేరు. సభలో ఉన్న ప్రధాని గానీ, కృష్ణమీనన్ గానీ ఈ ఆరోపణలను తిరస్కరించనే లేకపోయారు.

చైనీయుల దురాక్రమణ తర్వాత ప్రధానమంత్రికి 'జిందాబాద్' అనే రకాలు తెగ పెరిగిపోయారు. కాని, అసలింతకి గట్టిగా గాని, నామకహా గాని, ప్రధాన మంత్రిని అధికారాన్ని ఎదిరించింది. కాదన్నది ఎవరుటా ! ఇక్కడ ఒక విషయం స్పష్టంగా తెలుసుకోవాల్సి ఉంది. నెహ్రూ నాయకత్వాన్ని ఎదిరించటానికి, ఆయన విధానాలను విమర్శించటానికి చాలా తేడా ఉంది. కూటములు వర్గాల విషయంలో ప్రధానమంత్రికి ఎప్పుడూ విమర్శ ఎదురౌతూనే ఉంది. స్వతంత్ర దేశంలో ప్రభుత్వ విధానాలు విమర్శకు లోనుగావటం సహజం. అంతేగాని, ప్రజాస్వామ్య వ్యవస్థకే ప్రాణాధారకరమైన ఈ విమర్శను శ్రీ నెహ్రూ నాయకత్వాన్ని ఎదిరించటంగా లెక్కగడ్తే ఎలా ? సరే, అన్నిటికన్న ముఖ్యమైన ప్రశ్న ఒకటుంది. శ్రీ నెహ్రూ పరిరక్షణకు కంకణం కట్టుకున్న దెవరా ! పత్రికలవాళ్ళల్లో, న్యూయేజ్, బ్లిట్జ్, లింక్, పేట్రియాట్‌లు, వ్యక్తుల్లో కమ్యూనిస్టులు, వారి మిత్రులూనూ. నెహ్రూ నాయకత్వాన్ని ఈరోజుకు కూడా నెత్తిన పెట్టుకుంటున్న అసంఖ్యాక భారత ప్రజానీకానికి ఇంతకన్న అవ

# న్యూఢిల్లీ లేఖ

మానం, గొడ్డలిపెట్టు ఇంకేముంది?

కాంగ్రెస్ నాయకత్వానికి ముందు ముంద ఇంకా గడ్డురోజులు వచ్చేలా ఉన్నాయి కామరాజ్ పథకంలో ముఖ్యోద్దేశం ఒకటి. కాంగ్రెస్‌పార్టీలో ముఠాలను రూపుమాపి ఒకే దృక్పథంవల్ల మంత్రి వర్గాలను ఏర్పాటు చేయటం ఈ పద్ధతి ఆధరంగానే ప్రధానమంత్రి తన మంత్రివర్గం నుంచి ఆరుగురు మంత్రుల్ని తీసివేశారు. (అసలు ఉద్దేశ్యం వాళ్ళు తమ ఎదురుగా నిలబడటం లేదనేమో!)

ఉత్తర ప్రదేశ్ లో గుప్తా వ్యతిరేకవర్గం ఓడిపోయిన తర్వాత కాంగ్రెస్ పార్లమెంటరీ పార్టీలో బలానికి సమానంగా శ్రీమతి సుచేతా కృపలానీ మంత్రివర్గంలో ప్రాతినిధ్యం కోసం ఆ వర్గం ప్రయత్నాలు సాగిస్తున్నది కామరాజు పథకాన్ని అమలు జరుపుతున్న లక్షణం ఇలా ఉంది. ఇదిలా వుండగా, అభ్యుదయవాదులు వారి మిత్రులు కూడా కలకత్తాలో శ్రీ పాటిల్ ఉపన్యాసానికి వ్యతిరేక ఉద్యమం సాగించటానికి ప్రయత్నాలు సాగిస్తున్నారు ఇటీవల ఓ మాజీ మంత్రి శేఖరులు, కాంగ్రెస్ సిద్ధాంతంలో (అంటే అభ్యుదయ వాదంతో) సరిపడని వారంతా పార్టీనుంచి తప్పుకోవాలని బాహాటంగా సెలవిచ్చారుగదా! అసలీ గావుకేక నాగపూర్ సమావేశంలోనే ప్రారంభమైంది. అసలప్పటి నుంచీ నాగపూర్ తర్వాత వ్యతిరేక శక్తులు ఉమ్మడిగా కాంగ్రెస్‌లో చేరటం ప్రారంభించాయి. అయితే గోపాలరెడ్డి ప్రభృతులకు లభించే సమాధానమల్లా ఒకటే "నిజమే", మాలో ఏకీభావం లేనివాళ్ళం ఆ కాంగ్రెస్‌నుంచి బయటికి పోవడమే మంచిది. అసలు కాంగ్రెస్ అనేది ఈ నాటికికూడా అతివాదీ కాదు మితవాదీ కాదు. అదింకా మహాత్ముని అడుగు జాడల్లోనేవున్న కాంగ్రెస్. 



# సరాగమాల

వి ఎ కె రంగారావు

బి. గోపాలం సంగీత దర్శకుడు "నలదమయంతి" "శికారి రాముడు", "అప్పగింతలు", "అళగర్ మలై కళ్వన్" మొదలైన చిత్రాలకు సంగీత దర్శకత్వం వహించారు. సంగీత శాస్త్రంలో కొంత పరిచయమున్నవారికి ఆయా చిత్రాలలో కొన్ని పాటలు ప్రియపాత్రమైనవి

ఇటీవల బి గోపాలం గాయకునిగా కూడా పేరు తెచ్చుకుంటున్నారు ముదావహం ఇంతవరకు తమ స్వంత చిత్రాలలోనే అప్పుడప్పుడు పాడుతూ ఉండేవారు ఈ మధ్యనే ఇతర సంగీత దర్శకులకూ పాడుతున్నారు కొన్ని నెలల క్రిందట ఎస్ రాజేశ్వరరావుగారికి ఒక పద్యం, అంతకుముందు అనసూయాదేవి ఆధ్వర్యాన ఒక కన్నడ చిత్రంలో పాటలు పాడారు కాని ఇంతవరకు వారికి ప్రజాదరణ పొందే ఘనమైన పాటలనిచ్చి ప్రోత్సాహమిచ్చినది పెండ్యాల

ఇక్కడ ఒకమాట కొత్త కంఠాలకు ప్రోత్సాహం ఇవ్వటంలో పెండ్యాలదీ, రాజేశ్వరరావుదీ పెట్టింది పేరు వీరిద్దరి వలన వి సత్యరావు, వసంత, బస్వేశ్వర్ ఎంతో సహాయం పొందారు ఏ మంచి పాటలు లేక వూగుతూఉన్న పాత పాటకుల కళా జీవితాలనూ నీరుపోసి దృఢపరిచారు సరిగా ఆ సమయానికి ఆ పాటలు ఆదుకొనకపోతే, వారి జీవన మార్గం కొంత దారి తప్పేదేమో ఇదంతా వేరే సంగతనుకోండి మాటవరసకు చెప్తున్నాను

ఇక పెండ్యాలకు బి గోపాలం పాడిన పాటలు "శ్రీ కృష్ణార్జున యుద్ధంలో" ప్రసిద్ధమైన "అంచెలంచెలు" పాట పాడించక పూర్వమే ఏదో ప్రసంగవశాత్తు బి గోపాలం ప్రసక్తి వచ్చింది పెండ్యాలతో మాట్లాడుతూ ఉండగా ఇన్ని మాటలలో అనలేదు గాని "బి గోపాలం కంఠం శాస్త్రీయ శిక్షణ పొందినది చక్కని బరువున్నది" అను భావన వారి కున్నట్లు నాకు స్ఫురించినది పెండ్యాల వంటి సంగీత దర్శకునిలో ఇటువంటి భావం కలిగించిన గోపాలం కంఠం ధన్యమైనది

## శ్రీ కృష్ణార్జున యుద్ధం

పై చిత్రం ఎడుదలకు ముందే పెండ్యాల నతో అన్నారు ఒక కామెడీ పాట గోపాలంతో పాడించానని గోపాలంచేత కమెడీ పాట ఏమిటండీ అని మహా మహా తెలిసినవాడిలాగా అడిగాను నన్ని చిరునవ్వు నవ్వి సినిమాలో వింటారుగా అన్నారు సినిమాలో ఆ పాట విని ముగ్ధుణ్ణయిన తరువాత నా ప్రశ్న అసంబద్ధమె నదో, అవివేకమైనదో తెలిసి వచ్చింది అవున మరి ఆ అంతస్థులో ఉన్న సంగీత దర్శకుల తగ్గి వారితో పాడిస్తా రనుకోవటమే పొరపాటు. పాట వినకుండా దీని గురించి ఒక అభిప్రాయానికి రావటం ఇంకా పెద్ద పొరపాటు. పెండ్యాల సినిమా చూసిన వెంటనే ఇంటికి వెళ్లి చెప్పిన క్షమాపణలను అవలీలగా మెప్పుకోలుగా మార్చివేశారు. సహృదయులూ, వారిపై నాకున్న గౌరవభావాన్ని ఎరిగున్నవారూ కాబట్టి.

సాధారణంగా కామెడీ పాటలకు ఏ అల్లాటప్పా వరుసో పెట్టడం పరిపాటి. అది ఆ హాస్యగాని అంతస్తుకు తగే ఉంటుంది కాబట్టి, అది అంత ఎబ్బెట్టుగా అనిపించకపోవటం, ప్రజాదరణ పొందటం అడపాదడపా జరుగుతున్న సంగతే. కాని 'కృష్ణార్జున' వంటి చిత్రంలో అటువంటి పాటలకు స్థానంలేదు. కాబట్టి ఆ పాట ఏ వరుసలో, ఏ రాగములో తయారయిందో తెలుసునా ? ఫక్తు ఆధ్యాత్మిక రామాయణ కీర్తనల పద్ధతిలో, సిసలైన ఆనందభైరవి రాగంలో! సన్నివేశానికి తగిన రచన పింగళిది. అది ఈ పాట గురించే కాదు. వారు వ్రాసిన ఏ పాట గురించి అయినా నిర్భయంగా చెప్పవచ్చును. ఈ పాటలో మాటలు మరింత మురిపించటానికి కారణం ఆధ్యాత్మిక పరమైన మాటలు సమాసుకూలంగా హాస్యోక్తులవటం. ఇందులో వారికి బాగా చేయి తిరిగింది. "పెళ్లి చేసిచూడు", "మహామంత్రి తిమ్మరుసు" చిత్రాలలో "మనసులోని మనసా ఏమిటి నీ రభస"

"తథాస్తు స్వాముల కొలవండీ, అస్తినాస్తుల తెలియండి" గుర్తున్నవి కదా ! వీరి రచనలో మరొక ప్రత్యేకత. ఒక పరిస్థితిలో ఒక మాట వేయాలని తోస్తే అదే వేసేస్తారు. సాధారణ ప్రజానీకానికి అందదని, అందకపోతే వారి నోటికి రాదని, రాకపోతే ప్రజామోద ముద్ర పడదని కుంటిసాకులు చెప్పరు. (వైశమరారే చెలులారా). వారికి ఆదర్శ బలం కూడ వెనుక ఉంది మరి.

ఇక బి. గోపాలం స్వర్ణాలు పాడటం. ఒకసారి వినండి థాంట్లో ఉన్న గాంభీర్యం, వింత అందం మీరే తెలుసుకోండి



"నర్తనశాల"లో సావిత్రి.

రెండవ ప్రక్క సుశీల ఘంటసాల పాడిన 'మనసు పరిమళించెనే' అన్న చక్కటి యుగళ గీతం మోహనరాగం

## అనురాగం

అనురాగంలో తగిన సన్నివేశ బలం లేకపోవటం వల్ల ఉన్న రెండు నృత్య గీతాలకూ తగిన రాణింపు రాలేదు కాని లేపోతే అవి ఒక పూవు పూసిన పాటలు గోపాలం జమునారాణి మేళవింపు అత్యాకర్షణీయమైన జోడింపు ఇటువంటి ప్రయోగాలు విజయవంతంగా చేయాలంటే పెండ్యాల వంటి ప్రతిభాశాలే ఉండాలి

రెండు నృత్య గీతాలలో మొదటిది పూసలోళ్ల రాజమ్మ ఇది హైద్రాబాద్ ప్రాంతీయ జానపద వరవడి ఎ నారాయణరెడ్డిగారి రచనలోను ఆ ధోరణి కనుపిస్తున్నది రెండవ ప్రక్క భాంగ్డా నృత్యం భలే సరదాగా హుషారుగా ఉన్నది రచనలో ఒక్క గడియ నీ వుండకుంటే ఉడుకెత్తిపోవు వెన్నెల అన్న ప్రయోగం ఎన్నారేదే ఉడుకెత్తిస్తుంది

జమునారాణి అహో అన్నపుడు మీ మనసులు కూడా ఒహో అంటాయి ఊ అన్నపుడు ఊహూ అంటాయి ఈ గ్లామర్‌కి సరిగా బదులు చెప్పింది గోపాలం కంఠం

వినదగ పాటలు కొనదగ పాటలు 

# ఆవీ - ఇవీ - అన్నీ

## చందమామ ఫిలిమ్స్ ప్రొ॥ నెం 5 ప్రారంభోత్సవం

సెప్టెంబరు 15వ తేదీని ఉదయం 9 గంటలకు వీనస్ స్టూడియోస్‌లో చందమామ ఫిలింస్ వారి తాజా తెలుగు సాంఘిక చిత్రం షూటింగ్ లాంఛనప్రాయంగా వేద— మంత్ర పఠనాదులతో ప్రారంభమైంది శ్రీ ఎన్ టి రామారావు స్విచ్ నొక్కారు కుమారి జమున కాప్ కొట్టింది ప్రారంభోత్సవానికి ఆ చిత్రంలో నటించే నటీనటులు సాంకేతిక వర్గమేకాక నవయుగ ఫిలింస్ అధినేత శ్రీ చంద్రశేఖరరావు దర్శకులు వేదాంతం రాఘవయ్య చంగయ్య పాత్రికేయులు హాజరయ్యారు

శ్రీ చంద్రశేఖరరావు వేదాంతం రాఘవయ్య గారలు ఈ చిత్రంలో పనిచేసే సాంకేతిక వర్గానికి నటీనటులకు నిర్మాత శ్రీ డి ఎల్ నారాయణ దర్శకుడు ఎ సుబ్రహ్మణ్యంగార్లకు పూలమాలలు వేశారు

ఈ చిత్రంలో యన్ టి రామారావు కాంతారావు గుమ్మడి రమణారెడ్డి రాజనాల ఎ యస్ ఆర్ సత్యన్నారాయణ ధూళిపాళ జమున సూర్యకాంతం శారద జయంతి రాజశ్రీ మొదలగు వారు నటిస్తున్నారు

కథ కె ఆర్ ఆచార్య మాటలు పాటలు ఆత్రేయ ఛాయ రహెమాన్ అండ్ ప్రసాద్ సంగీతం యస్ రాజేశ్వరరావు కళ గొడగాంకర్ స్టూడియో : వీనస్ దర్శకత్వం ఎ సుబ్రహ్మణ్యం నిర్మాత : డి ఎల్ నారాయణ



కొత్తనటి మణిమాల (ప్రభాకర్)

## దేశద్రోహులు

సెప్టెంబరు నెలలో శ్రీ రామాపిక్చర్సువారు 5 సెట్సు పనిని పూర్తిచేశారు ఇప్పటికి 12 రీళ్ల చిత్రం పూర్తిఅయింది ఒక్కొక్క రోజు సెట్సును మార్చి 2 లేక 3 సీనుల పనికూడా పూర్తి చేశారు.

నడమంత్రపు సిరినాయుడు భుజంగరావు (రక్కిరినేని) షావుకారు (రాజబాబు) చెవిలో ఏదో రహస్యం చెబుతాడు హుందాగా షావుకారును చూస్తాడు

'తెలిసిందా ! జాగ్రత్తసుమా ?"

అదేంట బాబు ! యెవ్వారం చేస్తే ఇట్టా ఉండాలి ఎడకలా అతుక్కుపోవద్దూ

'సరే ! అయితే కానీ మరి !'

ఇక నేను చూసుకుంటాను మీరు గుండెల మీద చెయ్యేసుకు పడుకోండి భుజంగరావు బాబూ! ఈ వ్యవహారం సంగతి మీకు చెప్పకూడదనుకున్నాను గాని

అబ్బా చెప్పవయ్యా !'

'బాబూ ! యెదవడబ్బు పదివేలు రూపా



"ఎక్ హీ కౌన్ థీ"లో మనోజ్, సాధనా

యలు ఖర్చు అయినాసరే రేపు వచ్చే పంచాయితీ ఎన్నికల్లో నన్ను వైస్ ప్రెసిడెంటుగా నన్నా కూర్చోబెట్టాలి నాకదే ఆనందం ''

'దానికేం లేవయ్యా !''

'దానికేం లేవయ్యా ! అంటారు ఏంటండీ ? ఈ చేసేదంతా దానికోసమే కదండీ నాతో యెవ్వారానికి యెవ్వారమే అసలు చేసేదా సెయ్యందా సెప్పేయండి

ఇదిగో నువ్వెక్కడికి పోతావ్ నేనెక్కడికి పోతాను నువ్వు ముందు పనికానీ

చిత్తం ! అలాగన్నారు బావుంది బాబూ మీరే ఎలాగైనా ఈ ఉపకారం సెయ్యాలి వస్తా ! సెలవు '

షావుకారు నాలుగడుగులు వేశాడు ఆగి తనలో స్వగతం పలుకున్నాడు ఈలాంటి పాపపు పనులన్నీ చేయిత్తున్నాడ ఈ నడిమంత్రపు సిరి

# అవీ - ఇవీ - అన్నీ

నాయుడు నా కొంప ఏం ముంచుతాడోగదా ? సరే ! ఆ ఏడుకొండలవాడే ఉన్నాడు '

* * *

హత్యా పరిశోధనలో అనుమానం మీద అబద్దాలయ్య (రమణారెడ్డి)ని స్టేషనుకు తీసుకుపోతారు పోలీసులు అబద్దాలయ్య కూతురు (గిరిజ) భర్త గోపీ (రేలంగి)ని ఒత్తిడి చేస్తుంది ఎలాగైనా తండ్రిని విడిపించమని గోపీ భార్య బాధను ఏడుపును చూడలేకపోతాడు సరాసరి పోలీసు స్టేషనుకు వెళ్లి మామగారిని విడిపించాలని పోలీసుస్టేషన్ చేరుకుంటాడు గోపీ

ఇన్స్పెక్టర్‌గారూ! దయచేసి మీరేదైనాదారి చూపించాలి ఏదారి లే పోతే నాకు గోదారేగతి

''ఈ కేసుకు సంబంధించిన మిగతా నేరస్థులందరూ దొరికేవరకూ అబద్ధయ్యను జామీను మీద కూడ విడిచి పెట్టడానికి వీలులేదు

అబ్బబ్బ ! నేనిక్కడ ఉండటానికి వీలులేదు ఇంటికి వెళ్లడానికి వీలులేదు ఇన్స్పెక్టర్ గారూ! నా వైఫ్ ఏడుపు చూడలేక పోతున్నానుసార్ ఎడిచేడిచి కళ్లు ఇంతలావుగా వాచిపోయాయ్ రెండుఎళ్లు కూడ కదలిపోయాయ్

అయితే దానికి మమ్మల్నేమి చేయమంటారు ఇదిగో మిస్టర్ గోపీ ! ఈ ఖూనీ కేసులో అబద్ధయ్య జోక్యం ఏమీలేదని తేలితే తప్పక వదిలేస్తాం

ఆ భుజంగరావు జోగిందరు మా మామగార్ని ఏరికవాడ్ని చేసి మోసం చేశారుసార్.''

''అయితే ఈ హత్యలో అబద్ధయ్యకు ఏమీ జోక్యం లేదంటారా ?''

''పూర్తిగా లేదనీ చెప్పలేనూ, ఉందనీ చెప్పలేనూ, కాకపోతే భుజంగరావు, జోగిందర్లకు ఉన్నంత మాత్రం, లేదని మాత్రం చెప్పగలను. వాళ్లిద్దరూ మా మామను బ్లాక్‌మెయిల్ చేసి



"తిగుపతమ్మకథ"లో రాజసులోచన

డబ్బు పటుకుపోవడం కళ్లారా చూశానుసార్ అప్పుడు నాకీ గొడవ ఏమీ తెలీదండీ లేకపోతే అప్పుడే వళ్లిద్దర్నీ ఎలకొటు కొని మీ దగరకు లాక్కువచ్చే వాడ్ని సార్

ఎనీ ఇప్పుడు వాళ్ల ఆచోకి ఏమైనా తెలుసా ?''

తెలీదండి కాని తెలిసికోకుండా వదలిపెట్టనండి మా యాక్టర్లందర్నీ వదలేనంటే వాళ్ల జాతకాలన్నీ పట్టుకు వచ్చేస్తారు ఆ ఇన్‌ఫర్మేషన్ అంతా తీసుకొని మళ్లా తమ దర్శనం చేసుకుంటాను సెలవు ఇప్పించండి సార్ —

ఈ రెండు సన్నివేశాలు కూడ శ్రీరామా ఎక్చర్సువారి 'దేవద్రోహులు' చిత్రంలోనివే ఈ చిత్రంలో యన్ టి రామారావు రేలంగి, కాంతారావు రమణారెడ్డి రాజనాల మిక్కిలినేని, శోభన్‌బాబు జి ఎన్ స్వామి, రామకృష్ణ, సత్యనారాయణ మల్లాది ధూళిపాళ, చదలవాడ, పెరుమాళ్లు, రాజబాబు, రామకోటి, జగ్గారావు, దేవిక,



## రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలతో కాక విడిగా స్టాంపులు పంపే వారి రచనలు తిప్పి పంపడం సాధ్యం కాదు ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపే అవకాశం కూడా లేదని గుర్తించ ప్రార్థన

॥

జానకి, మాలతి, బేబిఇందిర, జెమినీచంద్ర మొద లగు వారున్నారు.

నిర్మాత, దర్శకుడు, ఛాయాగ్రహ పర్యవేక్షణ : బోళ్ల సుబ్బారావు, సంగీతం : యస్. రాజేశ్వర రావు, స్టూడియో : వాహినీ, విజయా.

## సెట్టుమీద "కలవారికోడలు"

నందీహిల్స్‌లో నవీన పద్ధతిలో ఆనంద్ విశ్రాంతి భవనము. ఆనంద్ తల్లి రాజ్యలక్ష్మి అనారోగ్య కారణంగా విశ్రాంతి కొరకు కుటుంబముతో సహా లతతోపాటు నందీ హిల్స్‌లో తమ స్వంత విశ్రాంతి భవనం చేరుకుంటారు.

రాజ్యలక్ష్మి లతతో జాబు వ్రాయిస్తుంది.

"వ్రాసినంతవరకు చదివి వినిపించు లతా!"

"శివానందం అన్నగార్కి చెల్లెలు రాజ్యలక్ష్మి నమస్కరించి వ్రాయునది. ఇక్కడంతా క్షేమం మంచిరోజు చూసుకుని బయలుదేరుతున్నాం. సౌభాగ్యవతులైన మా మేనకోడళ్లను అడిగినట్లు చెప్పవలసింది."

"అమ్మాయ్! వాళ్లు మాకు అన్నివిధాలా అయినవాళ్లు, కావలసినవాళ్లు. పెద్దమ్మాయి రాణినే మా అబ్బాయికి చేసుకోబోతున్నాం."

"ఆఁ!"

"మా కోడలు కూడ బాగా చదువుకుంది. ఈ కాలానికి తగినట్లు ఆటా, పాటా నేర్చుకుంది. ఆఁ రాయమ్మా! ఇంటికి చేరగానే లగ్నాలు పెట్టుకుందాం. మీ ఏర్పాట్లు మీరు చేయొచ్చు. నువ్వు చాదస్తం అను, ఏమన్నా అను, కయ్యమైనా, వియ్యమైనా—అంతస్థులు కలిసినవాళ్లతో చెయ్యాలి. ఏమంటావ్?"

"ఇంతకీ ఈ సంబంధం మీ అబ్బాయిగార్కి కూడా ఇష్టమేనాండీ."

"మా కుటుంబాల్లో మాటిస్తే తిరిగి పోవడం జరగదు. మాకైనా, మనువైనా ఒక్కసారే కదమ్మా, వ్రాఁ రాయమ్మా! మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి. వదిన్ని అడిగానని చెప్పు."

"వ్రాశానండి."

"మర్చిపోకుండా రేపు పోస్టు చేయించమ్మా" అంటూ రాజ్యలక్ష్మి తన గదిలోనికి వెళ్తుంది. ఆనంద్ హడావుడిగా వస్తాడు.

"లతా! నువ్వు ఎటువంటి ఛాన్సు పోగొట్టుకున్నావో తెలుసా?"

"హుఁ, పోయిన ఛాన్సు ఎలాగూ రాదు. పోనీండి".

"అంటే ఎలా కుదురుతుంది. ఇదిగో (పువ్వులు పువ్వులు, ప్రసాదం యిస్తూ) ఆవేళ గుళ్లోకి వెళ్లాం చూడు+ ఆ పూజారి యివాళ మళ్లీ ప్రసాదం, పువ్వులు యిచ్చాడు."

"చాల సంతోషం."

"ఈ పూలు పెట్టుకుని ప్రసాదం స్వీకరిస్తే ఏ కోరికైనా తీరుతుందిట."

"దేవుడు వరమిచ్చినా పూజారి వరమివ్వడంటలెండి."

"పాపం. ఈ పూజారి దేవుడులాంటి వాడులే. పద పద ఆకలవుతోంది."

ఈ చిత్రంలో రామారావు, ప్రభాకరరెడ్డి, రమణారెడ్డి, చలం, పద్మనాభం, శ్యామలరావు, కృష్ణకుమారి, సూర్యకాంతం, గిరిజ, గీతాంజలి, హేమలత, బేబి ఇందిర మొదలగువారున్నారు.

మాటలు : నార్ల చిరంజీవి, పాటలు : చిరంజీవి, సి. నారాయణరెడ్డి, కొసరాజు, ఛాయ : ఎం. జి. సింగ్, సంగీతం : టి. చలపతిరావు, కళ : బి. ఎస్. కృష్ణ, నృత్యం : వెంపటి సత్యం, అసోసియేట్ ప్రొడ్యూసర్ : ఎ. పూర్ణచంద్రరావు, నిర్మాత, దర్శకుడు : కె. హేమాంబరధరరావు.

సి. ధర్మారావు ★



అనుకోనిభంగిమలో జమున. (ఫొటో : రాధాకృష్ణన్)







Edited, Printed and Published by S Radhakrishna at the AndhraPatrika Press, 6 &7 Thambuchetty Street
Madras 1. Chief Editor S Sambhu Prasad.



వర్ధమాన నటి జయంతి (ప్రభాకర్)

